శ్రీః

# శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రకీర్తనాని

## శ్రీశివమానసికపూజాస్తుతిః - అద్వైత తారావళిః

ప్రతిపదార్థ - తాత్పర్య - వివరములు

**శంకరకింకరుడు**



ప్రకాశకులు

**శ్రీ లలితానందాశ్రమము**

వాడరేవు

# శ్రీః
# శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రకీర్తనాని
## శ్రీశివమానసికపూజాస్తుతిః - అద్వైత తారావళిః


ముద్రణ : శ్రీసదాశివబ్రహ్మేన్ద్రులవారి ఆరాధన, *09-05-2014*

ప్రతులు : *2000*

పేజీలు : *68*

వెల రూ. : అమూల్యము





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# సదాశివేన్ద్రస్తుతిః

శ్లో॥ పరతత్త్వలీనమనసే
ప్రణమద్భవబన్ధమోచనాయాశు ।
ప్రకటితపరతత్త్వాయ
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

శ్లో॥ పరమశివేన్ద్రకరామ్బుజ-
సంభూతాయ ప్రణమ్రవరదాయ ।
పదధూతపఙ్కజాయ
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

శ్లో॥ విజననదీకుఞ్జగృహే
మఞ్జులపులినైకమఞ్జుతరతల్పే ।
శయనం కుర్వాణాయ
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

శ్లో॥ కామాహిద్విజపతయే
శమదమముఖదివ్యరత్నవారిధయే ।
శమనాయ మోహవితతేః
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

– శ్రీ సచ్చిదానన్ద శివాభినవ నృసింహభారతీస్వామి, శృఙ్గగిరి.

## సదాశివేన్ద్రస్తుతిః

శ్లో॥ పరతత్త్వలీనమనసే
ప్రణమద్భవబన్ధమోచనాయాశు ।
ప్రకటితపరతత్త్వాయ
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

శ్లో॥ పరమశివేన్ద్రకరామ్బుజ-
సంభూతాయ ప్రణమ్రవరదాయ ।
పదధూతపఙ్కజాయ
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

శ్లో॥ విజననదీకుఞ్జగృహే
మఞ్జులపులినైకమఞ్జుతరతల్పే ।
శయనం కుర్వాణాయ
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

శ్లో॥ కామాహిద్విజపతయే
శమదమముఖదివ్యరత్నవారిధయే ।
శమనాయ మోహవితతేః
ప్రణతిం కుర్మః సదాశివేన్ద్రాయ ॥

– శ్రీ సచ్చిదానన్ద శివాభినవ నృసింహభారతీస్వామి,

మనసును నిలువద్రొక్కుటకు మహా మహితమగు మార్గమును చూపుటయే గాక అద్వయానందశిఖరసీమను చేర్చునవి శ్రీసదాశివబ్రహ్మేంద్రులవారి రచనలు.

సాధకులు – బ్రహ్మానందసామ్రాజ్యములో అడుగిడుదురుగాక.

శ్రీలలితానందాశ్రమము, వాడరేవున / శ్రీసదాశివబ్రహ్మేంద్రాశ్రమము, చిల్లకల్లున శ్రీ అరుళానందస్వామివారి దర్శనానంతరము ఈ గ్రంథము పొందదగును.

–రామోరా

శ్రీః

# శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రకీర్తనాని

కల్యాణిరాగః - ఆదితాళమ్.

## 1. భజరే గోపాలమ్

భజరే గోపాలం-
మానస! భజరే గోపాలమ్. భజరే॥

1. భజ గోపాలం భజిత కుచేలం
త్రిజగన్మూలం దితిసుతకాలమ్ ॥ భజరే॥

2. ఆగమసారం యోగవిచారం
భోగశరీరం భువనాధారమ్ ॥ భజరే॥

3. కదనకఠోరం కలుషవిదూరం
మదనకుమారం మధుసంహారమ్ ॥ భజరే॥

4. నతమందారం నందకిశోరం
హతచాణూరం హంసవిహారమ్ ॥ భజరే॥

**తాత్పర్యము :**

1. చిత్తమా! గోపాలుని సేవింపవే! కుచేలుడు కొలిచిన స్వామిని - ముల్లోకములకు మూలమైన వానిని - ఆ అసురాంతకుని గోపాలుని సేవింపవే!

2. వేదములు సారము గోపాలుడు! అద్వైతవేదాంతవిచారము గోపాలుడు! ఆయన భోగశరీరి: లోకాధారుడు. మానసమా! ఆ స్వామియందు తాదాత్మ్యము ననుభవింపవే!

3. చిత్తమా! ఆ స్వామి రణకర్కశుడే! కలుషమంటనివాడే! మదనజనకుడే! ఆ మధువైరిని - గోపాలుని భజింపవే!

4. ఓ మానసమా! కొలిచిన వారి కోరిక లీడేర్చు కల్పకమై - నందుని గారాలపట్టి యైన ఆ స్వామి చాణూరమల్లుని నేల గూల్చినవాడే! హంసయందు (సదాశివబ్రహ్మేంద్రుల గురువులు శ్రీ పరమ శివేంద్ర సరస్వతీమహాస్వామివారు. వారు పరమహంస పరివ్రాజకాచార్యులు. వారియందు) అని భావము.

---

కాఫీరాగః - ఆదితాళమ్

## 2. స్మర వారం వారమ్

స్మర వారం వారం - మానస!
స్మర నన్దకుమారమ్.

1. ఘోషకుటీరపయోఘృతచోరం
గోకులబృన్దావనసఞ్చారమ్ ॥ స్మర॥

2. వేణురవామృతపానవిలోలం
విశ్వస్థితిలయహేతువిహారమ్ ॥ స్మర॥

3. పరమహంసహృత్ పఞ్జరకీరం
పటుతరధేనుక-బక-సంహారమ్ ॥ స్మర॥

**తాత్పర్యము :**

నందుని కొడుకై వెలసిన స్వామినో మానసమా! మాటి మాటికి పునఃపునః సంస్మరింపవే!

1. వ్రేపల్లెలో వెలసిన వెన్నదొంగను - గోకులములో బృందావనమున విహరించుచు వెలుగులు జిమ్మువానిని - నందకిశోరుని తలఁచి తలచి మరల స్మరింపవే!

2. చిత్తమా! మధుమయమురళీగానామృతమున బరవశించి యుండు నందనందనుని శరణొందవే! విశ్వమును బాలించుటలో విలయమొనర్చుటలో కారణమై విహరించు వేలుపు దొఱను వెన్నంటి నిలువవే! వెంట వెంట తలంపవే!

3. పంజరములో నున్న చిలుకవలె - పరమహంస (శ్రీసదాశివుల గురువులు) హృదయములో స్థిరముగా నివసించు గోపబాలునియందు - బలముచే మదించిన ధేనుకాసుర బకాసురులను సంహరించిన స్వామియందు - ఓ నా మానసమా! విహరించుచు నుండవే!

---

సురుటి రాగః - ఆదితాళమ్

## 3. బ్రూహి ముకున్దేతి

బ్రూహి ముకున్దేతి - రసనే!
బ్రూహి ముకున్దేతి.

1. కేశవ! మాధవ! గోవిన్దేతి
కృష్ణానన్ద! సదానన్దేతి ॥ బ్రూహి॥

2. రాధారమణ! హరే! రామేతి
రాజీవాక్ష! ఘనశ్యామేతి ॥ బ్రూహి॥

3. గరుడగమన! నన్దకహస్తేతి
ఖణ్డితదశకంధరమస్తేతి ॥ బ్రూహి॥

4. అక్రూరప్రియచక్రధరేతి
హంస! నిరఞ్జన! కంసహరేతి ॥ బ్రూహి॥

**తాత్పర్యము :**

1. ముకుందా! ముకుందా! అని పలుకవే నాలుకా! కేశవా! మాధవా! గోవిందా! అని అనవే! కృష్ణా! ఆనందమయా! సదానందరూపా! అని ఉచ్చరింపవే! ముకుందా! అనవే!

2. రాధారమణా! హరీ! రామా! అని పిలువవే! రాజీవాక్షా! (తామరల వంటి కన్నులు గలవాడు) ఘనశ్యామా! (మేఘమువలె నల్లనివాడు) అనుచు ఆడవే! ముకుందా అనవే!

3. గరుడగమనా! (గరుడునిపై నెక్కి పోవువాడు) నందకహస్తా! (హరి చేతిలోని ఖడ్గము నందకము) అని సంబోధింపవే! రావణుని పదితలలను నరకిన ఓ రఘువీరా! అనుచు ఆహ్వానింపవే! ముకుందా! అనవే!

4. అక్రూరునియందనురాగముగల ప్రభూ! చక్రపాణీ! ఓయి హంసస్వరూపా! (పరమహంస పరివ్రాజకాచార్యవరులు! శ్రీ పరమశివేంద్ర సరస్వతులు) నిరంజనా! కంస సంహారీ! అనుచు ఆనందింపవే! ముకుందా! అనవే!

---

నవరోజ్ రాగః – ఆదితాళమ్

## 4. మానస సఞ్చరరే

మానస సఞ్చరరే – బ్రహ్మణి
మానస సఞ్చరరే.

1. శ్రీరమణీకుచదుర్గవిహారే
సేవకజనమన్దిరమన్దారే ॥ మానస॥

2. మదశిఖిపిఞ్ఛాలంకృతచికురే
మహనీయకపోలవిజితముకురే ॥ మానస॥

3. పరమహంసముఖచన్ద్రచకోరే
పరిపూరితమురళీరవధారే ॥ మానస॥

**తాత్పర్యము :**

మానసమా! అనంతమైన పరబ్రహ్మమున విహరించుచు ఆనందింపవే!

1. కోటకొమ్మున కొలువుదీరినటుల – ఆ పరబ్రహ్మము లక్ష్మీదేవియొక్క రొమ్ముల జంటను క్రమ్ముకొనియున్నదే! (హరియే పరబ్రహ్మము)

2. ఆ పరబ్రహ్మము తన్ను గొలుచువారి యింటి ముంగిట పారిజాతమే! అందు విహరింపవే! మానసమా! ముంగురులయందు నెమలిపింఛమునలంకరించుకొన్న – అద్దము కంటెను నున్ననైన బుగ్గలుగల శ్రీకృష్ణపరబ్రహ్మమున విహరింపవే!

3. చిత్తమా! చకోరము చంద్రునివంక ప్రేమతో పరికించునట్లు – పరమహంసలైన యోగీంద్రుల (పరమశివేన్ద్ర సరస్వతులు) మొగమును ఆ శ్రీకృష్ణపరబ్రహ్మము అనురాగముతో తిలకించుచుండవే!

మధుమయ మురళీగాన ప్రవాహముతో చెలగుచున్న ఆ శ్రీకృష్ణచంద్ర పరబ్రహ్మమునందు ఓ నా మానసమా! హత్తుకొని విహరించవే!

---

కున్తలవరాళీరాగః - ఆదితాళమ్

## 5. గాయతీ వనమాలీ

**గాయతి వనమాలీ - మధురం**
**గాయతి వనమాలీ.**

**1. పుష్పసుగన్ధిసు - మలయసమీరే**
**మునిజనసేవితయమునాతీరే ॥ గాయతి॥**

**2. కూజిత శుక - పిక - ముఖ ఖగకుఞ్జే**
**కుటిలాలికబహునీరదపుఞ్జే ॥ గాయతి॥**

**3. తులసీదామవిభూషణహారీ**
**జలజభవస్తుతసద్గుణశౌరీ ॥ గాయతి॥**

**4. పరమహంసహృదయోత్సవకారీ**
**పరిపూరితమురళీరవధారీ ॥ గాయతి॥**

**తాత్పర్యము :**

1. ఆహా! వైజయంతీ విభూషితుడైన శ్రీకృష్ణదేవుని మధురగానము చెలగుచున్నది.

పూలవాసనలతో గుబాళించుచున్న మలయమారుతముతో నిండిన - మునిజన నివాసమైన - యమునాతీరమున వనమాలి గానము సాగుచున్నది.

2. యమునయొడ్డున పొదలలో చిలుకలు, కోయిలలు కూయుచున్నవి. ఉంగరాల జుట్టువలె మబ్బులు ముసురుకొని వచ్చుచున్నవి. అపుడచట వాని నడుమ స్వామి గానము ప్రవహించుచున్నది.

3. తులసీమాలికావిభూషితుడు - బ్రహ్మసంస్తుతుడు - గుణశాలి - శౌరి - వనమాలి గానము చేయుచున్నాడు.

4. పరమహంసలైన యోగీంద్రుల (సదాశివబ్రహ్మేంద్రుల) హృదయము నానందముతో నిండించుచు - వనమాలి గోపాలదేవుడు - అడుగో! గానము చేయుచున్నాడు.

---

సురుటి రాగః – ఆదితాళమ్

### 6. క్రీడతి – వనమాలీ.

క్రీడతి వనమాలీ గోష్ఠే
క్రీడతి వనమాలీ.

1. ప్రహ్లాదపరాశరపరిపాలీ
పవనాత్మజజామ్బవదనుకూలీ ॥ క్రీడతి॥

2. పద్మాకుచపరిరమ్భణశాలీ
పటుతరశాసితమాలిసుమాలీ ॥ క్రీడతి॥

3. పరమహంసవరకుసుమసుమాలీ
ప్రణవపయోరుహగర్భకపాలీ ॥ క్రీడతి॥

**తాత్పర్యము :**

1. ఆహా! వనమాలి – వైజయంతీ విభూషితుడు క్రీడించుచున్నాడు. గోశాలలో! గోశాలలో!

ప్రహ్లాదుని బాలించిన దైవము – పరాశరమహర్షి నేలిన (వ్యాసుని తండ్రి పరాశరుడు) వేలుపుదొఱ హనుమంతునకు, జాంబవంతునకు అనుకూలుడై చెలగిన ప్రభువు – క్రీడించుచున్నాడు. గోశాలలో! గోశాలలో!!

2. లక్ష్మీదేవి రొమ్ములజంటను గాఢము హత్తి కౌగిలిలో గొన్న హరి – మాలిని. సుమాలిని శాసించిన వైకుంఠుడు అడుగో! గోశాలలో ఆడుచున్నాడు! గోశాలలో! (సుమాలి రావణుని మాతామహుడు. సుమాలి అన్న మాలి. హరి మాలిని యుద్ధమున సంహరించెను. సుమాలి పారిపోయెను. చూడు – రామాయణము ఉత్తరకాండ)

3. చక్కని పూలదండనువలె పరమహంసలైన యోగీంద్రులను (పరమ శివేంద్రులను) తనగుండెలయందు నిండించుకొన్న దేవదేవుడు – ఓంకారమనెడు తామరపూవులో శివుడై కూర్చున్న శ్రీకృష్ణపరబ్రహ్మము – గోశాలలో – పశుశాలా ప్రాంగణములో క్రీడించుచున్నాడు!

(శివుడు సదా ధ్యానమగ్నుడు. ఆయనకు చలనము లేదు. అట్లు సుస్థిరుడై ఓంకృతి గర్భమున వెలయుచున్నవాడని భావము)

---

సావేరి రాగః - ఆదితాళమ్

## 7. భజరే - యదునాథమ్

భజరే యదునాథం - మానస!
భజరే యదునాథమ్.

1. గోపవధూపరిరమ్భణలోలం
గోపకిశోరకమద్భుతలీలమ్ ॥ భజరే॥

2. కపటాఙ్గీకృతమానుషవేషం
కపటనాట్యకృతకుత్సితవేషమ్ ॥ భజరే॥

3. పరమహంసహృత్ తత్త్వస్వరూపం
ప్రణవపయోధరప్రణవస్వరూపమ్ ॥ భజరే॥

**తాత్పర్యము :**

1. ఓ మానసమా! యదుకులతిలకుని, యాదవశిరోరత్నమును శ్రీకృష్ణచంద్రుని సేవింపవే!

గోపీప్రియుడై, వారిని కౌగిలిలో గొనుటకై వేచిచూచు గోపకిశోరుని - ప్రభువును - ఓ నా చిత్తమా! హత్తి నిలువవే! తన లీలచే ఎల్లలోకమును ఆశ్చర్యరసమగ్న మొనరించు స్వామిని సేవింపవే!

2. ఓసి మానసమా! అతడు సాధారణ మానవుడు కాదే! లీలామానుష విగ్రహుడే! లోకముయొక్క కనులు గప్పుటకై మానవరూపము ధరించిన పరబ్రహ్మమే! నాట్య మాడుచున్నదే? హీనవేషము దాల్చియున్నదే! ఇదంతయు కపటమే! అది పరబ్రహ్మమే! ఆ యదువంశశిరోరత్నమును ఆరాధింపవే!

3. ఓ చిత్తమా! మహాయోగులు తమ యెడదలయందీ తత్త్వమునే ఆరాధించుచుందురే! ఇట్టి ప్రణవస్వరూపమే! ప్రణవమేఘమే! (మేఘము నీటిని వర్షించును. ప్రణవము ఆనందమును వర్షించును.) అన్యచింతలు వీడి దీని నారాధింపవే!

---

మోహనరాగః - ఆదితాళమ్

## 8. భజరే - రఘువీరమ్.

భజరే రఘువీరం - మానస!
భజరే రఘువీరం (బహుధీరమ్).

1. అమ్బుదడిమ్భవిడమ్బనగాత్రం
అమ్బుదవాహననన్దనగాత్రమ్ ॥ భజరే॥

2. కుశికసుతాపితకార్ముకవేదం
వశిహృదయామ్బుజభాస్కరపాదమ్ ॥ భజరే॥

3. కుణ్డలమణ్డనమణ్డితకర్ణం
కుణ్డలిమఞ్చకమద్భుతవర్ణమ్ ॥ భజరే॥

4. దణ్డితసున్దసుతాదికవీరం
మణ్డితమనుకులమాశ్రయశౌరిమ్ ॥ భజరే॥

5. పరమహంసమఖిలాగమవేద్యం
పరమవేదమకుటీప్రతిపాద్యమ్ ॥ భజరే॥

**తాత్పర్యము :** 1. ఓ మనమా! శ్రీరఘువీరుని శ్రీరాముని సేవింపవే! పిల్లమబ్బులను వెక్కిరించు నల్లని మేనుగల రఘునందనుని - ఇంద్రుని బిడ్డయైన జయంతుని బాలించిన ప్రభువును ఆరాధింపవే! (రామవనవాసవేళ అమ్మ రొమ్ములమధ్య నెత్తురోడునట్లు ముక్కుతో బొడిచిన కాకాసురుడు జయంతుడే. వానిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించియు శరణొందగా స్వామి కరుణించినాడు.)

2. కుశికాత్మజుడైన విశ్వామిత్రుని నుండి ధనుర్వేదము నెల్ల గ్రహించిన రామచంద్రుని - రవికిరణములు తామరలను వికసింపజేసినట్లు జితేంద్రియులైన మునుల హృదయములకు వికాసము గూర్చు శ్రీరామచంద్రుని సేవింపవే!

3. ఆదిశేషుని శయ్యగా గొని - కుండలాలంకృత కర్ణుడైన ఆ స్వామి శరీరచ్ఛాయ అద్భుతమైనదే! ఆ స్వామి నో చిత్తమా సంస్మరింపవే!

4. సుందుని కొడుకులైన మారీచసుబాహులను - ఇల్లాలైన తాటకను దండించిన వీరుని - తానవతరించి మనువంశమునకు గొప్ప ఖ్యాతిని గూర్చిన శౌరిని రఘునాథుని ఆశ్రయింపవే! ఆశ్రయించి సేవింపవే! పరమహంస స్వరూపియై - (పరమశివేంద్రుల రూపమున నున్న) వేదవేద్యుడైన ఆ స్వామిని వేదములకు కిరీటములు అనదగిన ఉపనిషత్తులు పరబ్రహ్మమని ప్రతిపాదించుచున్నదే! మానసమా! నీవా రఘుకులతిలకు నాశ్రయించి మేలొందవే!

---

కామ్భోజిరాగః - త్రిపుట తాళమ్

## 9. ప్రతివారం - వారమ్.

ప్రతి వారం వారం - మానస!
భజరే రఘువీరమ్!

1. కాలామ్భోధరకాన్తశరీరం
కౌశికశుకశౌనకపరివారమ్ ॥ భజరే॥

2. కౌసల్యాదశరథసుకుమారం
కలికల్మషభయగహనకుఠారమ్ ॥ భజరే॥

3. పరమహంసహృత్పద్మవిహారం
ప్రతిహతదశముఖబలవిస్తారమ్ ॥ భజరే॥

**తాత్పర్యము :**

1. మాటిమాటికి - పౌనఃపున్యము - ఓ మనసా! రఘునాథుని భజింపవే!

నీటితో నిండిన నల్లనిమబ్బువలె మెఱయు మైచాయగల రఘునాథుని హత్తి నిలువవే! కుశికనందనుడు విశ్వామిత్రుడు, వ్యాససూనుడు శ్రీశుకుడు, శునకమునీంద్రుని కొడుకు శౌనకుడు ఆ స్వామి పరివారములోని వారేనే! నీవా రఘువీరుని గొలిచి మేలొందవే!

2. చిత్తమా! శ్రీకౌసల్యాదేవి కడుపుపంట - దశరథరాజన్యుని గారాలపట్టి అయిన రఘురాముడు - అడవివలె పెరిగిపోయిన ఈ కలిలోని కాలుష్యమునకు గొడ్డలిపెట్టు వంటివాడే! ఆ స్వామిని దలచి కొలిచి సుఖింపవే!

3. పరమహంస (పరమశివేంద్రుల) హృదయపద్మమున విహరించు శ్రీరాముని - పదితలలతో నిక్కిన రావణుని సేనలను చీల్చి చెండి చెక్కి వేసిన రఘువీరుని - ఓ మనసా? మాటిమాటికి మననము చేసి మహానందమునందుకొనవే!

---

సురుటిరాగః - ఆదితాళమ్

## 10. చేతః శ్రీరామమ్.

చేతః శ్రీరామం - చిన్తయ
జీమూతశ్యామమ్.

1. అఙ్గీకృతతుమ్బురుసఙ్గీతం
హనుమద్గవయగవాక్షసమేతమ్ ॥ చేతః ॥

2. నవరత్నస్థాపితకోటీరం
నవతులసీదలకల్పితహారమ్ ॥ చేతః ॥

3. పరమహంసహృద్గోపురదీపం
చరణదలితమునితరుణీశాపమ్ ॥ చేతః ॥

**తాత్పర్యము :**

1. చిత్తమా! మేఘశ్యాముని శ్రీరాముని ధ్యానింపవే! తుంబురుగానము నంగీకరించిన ప్రభువును, హనుమతో - గవయ గవాక్షవీరులతో కొలువుదీరియున్న శ్రీరఘునాథుని ఆశ్రయింపవే!

2. శిరమున నవరత్నకిరీటముతో - మెడలో తులసీ దళదామముతో శోభించు రామచంద్రుని - ఓ చిత్తమా! ఆశ్రయింపవే! ఆశ్రయించి ధ్యానింపవే!

3. గుడిగోపురమున ధగధగ మెఱయు దీపమువలె యోగి పుంగవుల (పరమ శివేంద్రుల) హృదయములో వెలుగులు జిమ్ము శ్రీరాముని - పాదస్పర్శచేతనే పాషాణమును పడతిగా మార్చిన (అహల్యా శాపవిమోచనము) **శ్రీరామచంద్ర పరబ్రహ్మమును చిత్తమా! సేవింపవే! సేవించి ధ్యానింపవే!**

---

జఞ్ఝోటి రాగః - ఆదితాళమ్

## 11. పిబరే - రామరసమ్.

పిబరే రామరసం - రసనే!
పిబరే రామరసమ్.

1. దూరీకృతపాతకసంసర్గం
పూరితనానావిధఫలవర్గమ్ ॥ పిబరే॥

2. జననమరణభయశోకవిదూరం
సకలశాస్త్రనిగమాగమసారమ్ ॥ పిబరే॥

3. పరిపాలితసరసిజగర్భాణ్డం
పరమపవిత్రీకృతపాషణ్డమ్ ॥ పిబరే॥

4. శుద్ధపరమహంసాశ్రయగీతం
శుకశౌనకకౌశికముఖపీతమ్ ॥ పిబరే॥

**తాత్పర్యము :**

శ్రీరామనామరసమునో నా జిహ్వేంద్రియమా! ఆస్వాదింపవే! ఆస్వాదించి చెన్నొందవే!

1. రామరసము నాస్వాదింపుము. పాపములు నీదరి జేరవు. రామరసపాన మొనరింపుము - చతుర్విధపురుషార్థములు కొల్లలుగా ఫలించును.

2. శ్రీరామనామామృతసేవనముచే - "చచ్చెదమని - మరల బుట్టెదమని" భయము ఏది ఇంతవరకు బీడించుచున్నదో - అది మటుమాయమై పోవునే! జిహ్వేంద్రియమా! శ్రీరామరసమును పానమొనరింపవే! ఇది సకల వేదసారమే! సర్వ శాస్త్రములు, ఆగమములు దీనినే నిరూపించుచున్నవే!

3. బ్రహ్మాండము నెవరు పాలించుచున్నారు. శ్రీరామ నామామృతము! పతితులను సైతము పరమ పవిత్రులుగా మార్చగల వారెవరు? శ్రీరామరసాయనము! అది మాత్రమే ఆ పని చేయగలదు.

అందుచే **రసనేంద్రియమా! రామరసపానము జేసి రంజిల్లవే!**

4. నిర్మలాంతఃకరణులైన యోగివరేణ్యులు (పరమశివేంద్రులు) శ్రీరామనామమును గానము చేయుచుందురే? ఓ రసనేంద్రియమా! శ్రీశుకయోగి - శౌనక మునివరుడు- విశ్వామిత్ర మహర్షి శ్రీరామనామామృతము నాదరముతో సేవించిన వారే సుమా! ఓనా జిహ్వేంద్రియమా! రామరసాయనమును సేవింపవే!

---

అఠాణారాగః - ఆదితాళమ్

## 12. ఖేలతి - మమ - హృదయే.

ఖేలతి మమ హృదయే
రామః ఖేలతి మమ హృదయే.

1. మోహమహార్ణవతారకకారీ
రాగద్వేషముఖాసురమారీ ॥ ఖేలతి॥

2. శాన్తివిదేహసుతాసహచారీ
దహరాయోధ్యానగరవిహారీ ॥ ఖేలతి॥

3. పరమహంససామ్రాజ్యోద్ధారీ
సత్యజ్ఞానానన్దవిహారీ ॥ ఖేలతి॥

**తాత్పర్యము :**

1. ఆహా! నా హృదయములో - రాగద్వేషాది రాక్షస వర్గమును నేలగూల్చుచు - అంతములేని అజ్ఞాన సముద్రమును దాటించువాడై - రాముడు. శ్రీరామచంద్రుడు క్రీడించుచున్నాడు.

2. పరమ ప్రశాంతియే సీతమ్మతల్లియై తన్ను వెన్నంటి నిలువగా - హృదయ దేశమునందు యోగిజనైకవేద్యమైన దహరస్థానమునే అయోధ్యగా స్వీకరించి అందు విహరించుచు రాఘవుడు క్రీడించుచున్నాడు.

3. ఆహా! సత్యజ్ఞాన - ఆనందరూపుడై, యోగిజనులకు (పరమశివేంద్రులు) ఆత్మజ్ఞాన సామ్రాజ్యమును సముద్ధరించుచు రాఘవుడు నా హృదయములో ఇదుగో! క్రీడించుచున్నాడు.

---

తోడిరాగః - ఆదితాళమ్

## 13. ఖేలతి పిణ్డాణ్డే.

ఖేలతి పిణ్డాణ్డే
భగవాన్ - ఖేలతి పిణ్డాణ్డే.

1. హంసః సోహం హంసః సోహం
హంసః సోహం సోహమితి ॥ ఖేలతి॥

2. పరమాత్మాహం పరిపూర్ణోహం
బ్రహ్మైవాహమహం బ్రహ్మేతి ॥ ఖేలతి॥

3. త్వక్ చక్షుః శ్రుతి జిహ్వాఘ్రాణే
పంచవిధప్రాణోపస్థానే ॥ ఖేలతి॥

4. శబ్దస్పర్శరసాదికమాత్రే
సాత్వికరాజనతామసమిత్రే ॥ ఖేలతి॥

5. బుద్ధిమనశ్చిత్తాహంకారే
భూజలతేజోగగనసమీరే ॥ ఖేలతి॥

6. పరమహంసరూపేణవిహర్తా
బ్రహ్మవిష్ణురుద్రాదికకర్తా ॥ ఖేలతి॥

**తాత్పర్యము :**

1. బ్రహ్మాండమునందంతటను నిండియున్న భగవంతుడు నాయీ పిండాండములో - దేహములో ఆడుచున్నాడు. 'హంసః సోహం - హంసః సోహం - హంసః - సోహం సోహం' అని పలుకుచు ఆడుచున్నాడు.

**వివరము :** మనము గాలిని బీల్చుచున్నాము; విడుచు చున్నాము. గాలి లోపలకు ప్రవేశించుచు 'హం' అని ధ్వనించుచున్నది. బయటకు బోవుచు 'సో' అని ధ్వనించుచున్నది. అనగా మన ఊరుపు నిట్టూరుపులయందు 'హంసో' అన్న ధ్వని పుట్టుచున్నది.

సంస్కృత భాషలో పదాంతమునందలి ఓకారము - విసర్గముయొక్క వికారమే. అందుచే ఊర్పు నిట్టూర్పులు 'హంసః' అని ధ్వనించుచున్నవని తెలియుచున్నది.

ఊర్పు తరువాత నిట్టూర్పును గాక - నిట్టూర్పు తరువాత ఊర్పును పరిగణింపగా ఆ ధ్వని 'సోహం' అగుచున్నది.

ఇట్లు మనము గమనించుట లేదుగాని - మనయందు 'హంసః - సోహం' అన్న ధ్వనులు నిరంతరము సాగుచున్నవి. హకారము - శివవాచి, సకారము శక్తి వాచకము.

'హంసః' అనగా శివశక్తులే!

'హంసః సోహం - హంసః సోహం' అనుచు శివశక్త్యాత్మకమైన దైవతత్త్వమే (చెడుగుడి ఆటలో బాలురు కూత కూయుచున్నట్లు) మనయందాడుచున్నది.

**ఇచట మరొక విశేషము :** 'సోహం' అనుదానిని విడదీయగా 'సః + అహం' అగును. ఉన్నవి ఈ రెండక్షరములే కాని, ఈ 'అకారము' 'ఓకార - హకారముల' నడుమ జనించుటకు సంస్కృత వ్యాకరణము అవకాశము కల్పించును, అందుచే 'సోహం' అనుదానిని విడదీయగా "సః + అహం" అగును.

'సః = వాడు, అహం = నేను, వాడు నేను అనగా 'వాడే నేను' అగుచున్నది. అనగా - 'వాడే నేను, నేనే వాడు' అన్న అర్థము జనించుచున్నది.

శివశక్తి స్వరూపమైన దైవతత్త్వము నాపిండాండములో 'హంసః సోహం హంసః సోహం' అనుచు - 'నేనే వాడు, వాడే నేను' అని నిరంతరము పల్కుచు - ఫలితముగా - నేను పరమాత్మను, నేను పరిపూర్ణుడను, నేను బ్రహ్మమును, బ్రహ్మమే నేను - అని ఘోషింపుచు విహరింపుచున్నది. ఇది సత్యము.

ఉత్తమ సాధకునకిది అనుభవములో సాక్షాత్కరించును. అట్టివాడు తన ఊర్పు నిట్టూర్పులపై భగవంతుని యొక్క యీ క్రీడావిహారమునందు చిత్తమును నిలిపి, పరిణతుడై **అద్వైతశిఖరాగ్రమును జేరి బ్రహ్మాత్మైక్యము** ననుభవించును.

**'సాధన చేయనివానికి ఏమియును లేదు'.**

2. నేను పరమాత్మను, నేను పరిపూర్ణుడను! నేను బ్రహ్మమును బ్రహ్మము నేనే! అనుచు భగవంతుడు - భగవానుడే నా శరీరమునందాడుచున్నాడు.

3. నా త్వగింద్రియము (చర్మము)లో - కంటిలో - చెవిలో - ముక్కులో - నాల్కపై స్వామి క్రీడించుచున్నాడు! ప్రాణపంచకమునకు ఆశ్రయమైన నా దేహములో **'బ్రహ్మైవాహం'** అనుచున్నాడు! క్రీడించుచున్నాడు.

4. మనోబుద్ధ్యహంకారచిత్తాత్మకమైన నా అంతఃకరణములోని నాల్గు భాగముల యందును - భగవానుడు 'బ్రహ్మైవాహ' మ్మనుచు గంతులు వేయుచున్నాడు.

5. **'నేల - నీరు - నిప్పు - గాలి - ఆకసము'** - అనెడు పంచభూతముల సమ్మిశ్రమముగానున్న నా యీ పిండాండములో హరియొక్క క్రీడావిహారము నిరంతరముగా సాగుచున్నది.

6. పరమహంసలైన యోగీంద్రుల రూపమున (సదాశివుల గురువులు) లోకమున వివరించు స్వామి - బ్రహ్మ - విష్ణు - మహేశులకు మూలమైన దైవము - నా పిండాండమున గ్రీడించుచున్నాడు.

---

ధనాసరీరాగః - ఆదితాళమ్

## 14. స్థిరతా నహి - నహిరే.

స్థిరతా నహి నహిరే - మానస!
స్థిరతా నహి నహిరే

1. తాపత్రయసాగరమగ్నానాం
దర్పాహంకారవిలగ్నానామ్ ॥ స్థిరతా॥

2. విషయపాశవేష్టితచిత్తానాం
విపరీతజ్ఞానవిమత్తానామ్ ॥ స్థిరతా॥

3. పరమహంసయోగివిరుద్ధానాం
బహుచఞ్చలతరసుఖబద్ధానామ్ ॥ స్థిరతా॥

**తాత్పర్యము :**

ఓసి మానసమా! కుదురుండదే? వారికి శాంతియుండదే?

1. ఆధ్యాత్మికము (శరీరసంబంధి) ఆధిభౌతికము (పంచభూతములవల్లనైనది) ఆధిదైవికము (దైవసంబంధి) అని మూడు రకములైన తాపములు. ఈ తాపత్రయము సముద్రమువలె అంతము లేనిది. అందు మునిగినవారికి కుదురుండదే మానసమా! గర్వమున - అహంకారమున తగులుకొన్న వారికి శాంతి యుండదే!

2. శబ్ద - స్పర్శ - రూప - రస - గంధాత్మకములైన విషయములు పాశములు. అవి చుట్టలు చుట్టలుగా నెవరిని జుట్టి బాధించుచున్నవో వారికి - ఓ మానసమా! కుదురుండదే! స్థిరతయుండదే!

ఏది తాను కాదో - దానిని తాననుకొనుట (శరీరము తాననుకొనుట) ఏది - తానో - అది తాను కాదనుకొనుట (అచ్ఛమైన ఆత్మను తానుగా గుర్తింపకపోవుట) అనగా అనాత్మయందు ఆత్మభావము, ఆత్మయందు అనాత్మభాము - విపరీతజ్ఞానము అనబడును.

ఇట్లు విపరీతజ్ఞానముచే ఎవ్వరి బుద్ధి చెడియున్నదో - వారికి ఓ చిత్తమా! శాంతి ఎట్లుండునే? స్థైర్యము ఎట్లు లభించునే?

3. పరమహంసలైన యోగీంద్రులు (సదాశివుల గురువులు) ఉపదేశించు యోగ మార్గమును వ్యతిరేకించువారికి - మిక్కిలి చంచలములైన ఇంద్రియసుఖములయందు దగులు కొన్నవారికి చిత్తమా! శాంతియుండదే! నిలుకడ ఉండదే!

---

ఆనన్దభైరవిరాగః - ఆదితాళమ్

## 15. నహిరే నహి శఙ్కా.

నహిరే నహి శఙ్కా
కాచి - న్నహిరే నహి శఙ్కా .

1. అజమక్షరమద్వైతమనన్తం
ధ్యాయన్తి బ్రహ్మ పరం శాన్తమ్ ॥ నహిరే॥

2. యే త్యజన్తి బహుతరసన్తాపం
యే భజన్తి సచ్చిత్సుఖరూపమ్ ॥ నహిరే॥

3. పరమహంసగురుభణితం గీతం
యే పఠన్తి నిగమార్థసమేతమ్ ॥ నహిరే॥

**తాత్పర్యము :**

వారికి ఏ భయమును లేదు, ఉండదు! ఎవరికి? బ్రహ్మానుసంధానపరులకు! 'బ్రహ్మపదార్థము పుట్టదు గిట్టదు. అదొక్కటే ఉన్నది, రెండవది లేనే లేదు. అది అనంతము. దాని కంటె గొప్పది శాంతమైనది లేదు' - అని యీ విధముగా ఎవరు నిరంతరము బ్రహ్మానుసంధానపరులై ఉంటారో - వారికి సందేహాలు ఉండవు. భయాలు జనింపవు.

2. ఎవరు బహుళ తాపములను దెచ్చిపెట్టు సంసారాసక్తిని వీడి - సచ్చిదానంద మయమైన పరబ్రహ్మమే తానని ధ్యానించి సేవింతురో వారికి లేశమున్నూ భీతి లేదు. ఉండదు.

3. ఇట్టివారికి ఏ శంకయును లేదన్న యీ మాట పరమహంసలైన గురువులు చెప్పిన మాట సుమా! వేదార్థమిదియే సుమా! ఇట్టున్న యీ గీతము నెవరు పఠింతురో పఠించి ఆచరింతురో - వారికి భయమా! వారికి భీతియా! వారికి శంకయా! లేదు! కలుగదు!! ఉండదు!!!

---

కామ్బోదిరాగః - ఆదితాళమ్

## 16. చిన్తా నహిరే - నాస్తి కిల

చిన్తా నాస్తి కిల
తేషాం - చిన్తా నాస్తి కిల.

1. శమదమకరుణాసమ్పూర్ణానాం
సాధుసమాగమసంకీర్ణానామ్ ॥ చిన్తా॥

2. కాలత్రయజితకన్దర్పాణాం
ఖణ్డితసర్వేంద్రియదర్పాణామ్ ॥ చిన్తా॥

3. పరమహంసగురుపదచిన్తానాం
బ్రహ్మానన్దామృతమత్తానామ్ ॥ చిన్తా॥

**తాత్పర్యము :**

చింతలేదు - వారికి శోకము లేదు.

1. అంతరింద్రియములను, బహిరింద్రియములను బూర్తిగా అదుపులో ఉంచుకొన్నవారికి - సజ్జనసంగతియందు కాలము గడుపువారికి దుఃఖము లేదు! చింత లేదు!

2. మూడువేళలయందును కామునెన్నడును కదలనీయని వారికి - అన్ని యింద్రియముల విజృంభణమును బూర్తిగా అరికట్టిన వారికి చింత ఏమున్నది! శోకమేమున్నది!!

3. పరమహంసలైన శ్రీగురువుల పాదములయందు దమ్ముదామర్పించుకొన్నవారికి (సదాశివబ్రహ్మేంద్రులవారు తమ గురువులను స్మరించుచున్నారు. ఎవ్వరైనను తమ గురువుల నిటులే భావింపవలెనని భావము) - బ్రహ్మానందామృతపానముచే తమ్ము దామరచువారికి చింత ఏమున్నది? శోకమేమున్నది?

---

నాథనామక్రియారాగః - ఆదితాళమ్

## 17. బ్రహ్మైవాహం కిల

బ్రహ్మైవాహం కిల
సద్గురుకృపయా - బ్రహ్మైవాహం కిల ।

1. బ్రహ్మైవాహం కిల గురుకృపయా
చిన్మయబోధానన్దఘనం తత్ ॥ బ్రహ్మై॥

2. శ్రుత్యనన్తైకనిరూపితమతులం
సత్యసుఖామ్బుధిసమరసమనఘమ్ ॥ బ్రహ్మై॥

3. కర్మాకర్మవికర్మవిదూరం
నిర్మలసంవిదఖణ్ణమపారమ్ ॥ బ్రహ్మై॥

4. నిరవధిసత్తాస్పదపదమజరం
నిరుపమ మహిమని నిహితమనీహమ్ ॥ బ్రహ్మై॥

5. ఆశాపాశవినాశనచతురం
కోశపఞ్చకాతీతమనన్తమ్ ॥ బ్రహ్మై॥

6. కారణకారణమేకమనేకం
కాలకాలకలిదోషవిహీనమ్ ॥ బ్రహ్మై॥

7. అప్రమేయపదమఖిలాధారం
నిష్ప్రపఞ్చనిజనిష్క్రియరూపమ్ ॥ బ్రహ్మై॥

8. స్వప్రకాశశివమద్వయమనఘం
నిష్ప్రతర్క్యమనపాయమకాయమ్ ॥ బ్రహ్మై॥

తాత్పర్యము :

1. శ్రీ గురువుల కరుణచే నేను బ్రహ్మమునే! శ్రీగురుకృపచే - 'చిన్మయము.

జ్ఞానానందములచే ఘనీభూతము అయిన బ్రహ్మమే నేనని' నాకు అనుభవమునకు వచ్చినది.

2. దేనిని వేదములు అనంతమని – ఒక్కటియని నిరూపించుచున్నవో, దేనిని సత్యమని – ఆనంద సముద్రమని – పెరుగుట, తరుగుట ఎఱుగని నిత్యసమరసమని కీర్తించుచున్నవో – ఆ బ్రహ్మమే నేను! శ్రీగురుకరుణాప్తిచే నేను బ్రహ్మమునైతిని!

3. ఏ బ్రహ్మానుభవమున 'జేయదగిన – చేయగూడని విశేషముగా జేయదగిన కర్మలన్నవి కొంచెము కూడ శేషించి యుండవో, ఏది నిర్మలజ్ఞానరూపమో, దేనియందు విభాగములన్నవి లేవో, మరియు నెయ్యది సారము లేనిదో – శ్రీగురుకరుణావిశేషముచే అట్టి బ్రహ్మము నేనై యున్నాను.

4. ఏది నిరవధికసత్యమో – (ఎన్నడును ఏ వేళయందును మారదో) దేనియందు శైథిల్యము కొంచెమును లేదో – దేని మహిమకు సాటిలేదో – తన మహిమయందే ఏది తాను నిలిచియున్నదో – ఎందు కోరికలన్నవి ఉదయింపవో శ్రీగురువుల కరుణచే నేనా బ్రహ్మమునై యున్నాను.

5. కోరికలన్న పాశములకు అంతముండదు. బ్రహ్మానుభవము కలిగినంతనే ఆ కోరికలు మరి నిలువవు. అన్నమయ – ప్రాణమయ – మనోమయ – జ్ఞానమయ – ఆనందమయములనెడు పంచకోశములను దాటిన మీదట అనుభవమునకు అందునట్టి అనంతమైన ఆ బ్రహ్మము నేనే!!

6. లోకములో దేని ఉనికికైనను కారణమున్నది; కాని బ్రహ్మమునకు కారణము లేదు. అన్నిటికిని అదియే కారణముగా నున్నది. అందుచే అది సర్వకారణములకును కారణమైనది. అది ఒక్కటి. అనేకముగా దోచుచున్నది.

ఆ బ్రహ్మపదార్థము 'ఫలానా కాలములోనిది అని కాలములో బంధించుటకు వీలుకానిది. కాలమన్నది తలయెత్తనిచోట అది ఉన్నది. అందుచే అది కాలమునకును కాలుడైనది; మృత్యువైనది.

'కలి' అనునది కాలములోని మురికి; మడ్డి. ఇచట పాపమే ఎక్కువ. కాలమనునది తలఎత్తని తావుకదా బ్రహ్మము. కాలప్రసక్తియే లేనిదైన బ్రహ్మమున కలిదోషము లెటులంటును? ఇట్టి పరబ్రహ్మము నేనే!!

7. పరబ్రహ్మముయొక్క పరిణామము – ఇంతయని కొలుచుట ఎవరికిని సాధ్యము కాదు. అది సర్వాధారము. అచట ప్రపంచము లేదు. అచ్చట ఏవిధమైన క్రియయును లేదు.

అట్లు అమేయము – అఖిలాధారము – నిష్ప్రపంచము – నిష్క్రియము అయిన బ్రహ్మము నేనే!!

8. లోకములోని ఏ వస్తువును స్వయంప్రకాశము కాదు. అనగా పరాపేక్షలేక తానై స్ఫురింపదు, ప్రకాశింపదు. సూర్యుడున్నాడు. స్వయముగనే ప్రకాశించుచున్నాడు కదా! అనవచ్చును. కాని అతడు తనంత తానై స్ఫురింపడు. వాని స్ఫురణమునకు 'నీవో – నేనో' అవసరము. అపుడు మాత్రమే వాని ఉనికి అవగతమగును. కాని సర్వులను అనుభవించు 'నేను, అన్న దాని స్ఫురణమునకు పరాపేక్షయున్నదా! లేదు. అందుచే 'నేను' అన్నది తప్ప అన్యములన్నియును పరతః ప్రకాశములే.

ఈ నేను రెండు విధములుగా నున్నది. బుద్ధియందు తోచు **'అహంతా స్ఫూర్తి'** అచ్చమైనది కాదు. అది అజ్ఞానవిలాసము, బుద్ధిని దాటిపోయినపుడు ఏది తాను అనెడి అనుభూతి ఉదయించునో అది నిజమైన నేను. అది ఆత్మ. అది బ్రహ్మము. అది – అదొక్కటి మాత్రమే స్వయంప్రకాశశీలము. ఇతరములన్నియు దాని మహిమచే మాత్రమే స్ఫురించుచున్నవి. తెలియబడుచున్నవి. (నేను – ఆత్మ– బ్రహ్మము – ఇదొకటి మాత్రము తమకు దామై తెలియబడవు.) అందుచేతనే. శ్రుతి – **'యస్య భాసా సర్వమిదం విభాతి'** అన్నది. అనగా బ్రహ్మము స్వయంప్రకాశశీలమైనదని అర్థము.

మరియును ఆ బ్రహ్మము మంగళమయమైనది. అది ఒక్కటన్న ఒక్కటి, రెండవది లేనేలేదు. అందుచే అది అద్వయము.

ఆ బ్రహ్మవస్తువు తర్కములకు జిక్కునది కాదు. దానికొక అపాయమన్నది ఎన్నడును లేదు, కలుగదు. దానికి శరీరము లేదు.

ఇట్లు స్వయంప్రకాశమై – శివమై – అతర్క్యమై – అనపాయమై – అశరీరియై యున్న బ్రహ్మము నేనే!!

(ఇచట 'శివ' శబ్దము సదాశివుల గురువులకు సూచకము)

---

నవరోజ్ రాగః - ఆదితాళమ్

## 18. సర్వం బ్రహ్మమయమ్.

సర్వం బ్రహ్మమయమ్
రేరే - సర్వం బ్రహ్మమయమ్.

1. కిం వచనీయం కిమవచనీయం
కిం రచనీయం కిమరచనీయమ్ ॥ సర్వం॥

2. కిం పఠనీయం కిమపఠనీయం
కిం భజనీయం కిమభజనీయమ్ ॥ సర్వం॥

3. కిం బోద్ధవ్యం కిమబోద్ధవ్యం
కిం భోక్తవ్యం కిమభోక్తవ్యమ్ ॥ సర్వం॥

4. సర్వత్ర సదా హంసధ్యానం
కర్తవ్యం భో! ముక్తినిదానమ్ ॥ సర్వం॥

**తాత్పర్యము :**

సర్వము బ్రహ్మమయమే! అంతయును బ్రహ్మమే! ఇదంతా బ్రహ్మమేరా!

1. ఇచట ప్రవచింపదగిన దేమున్నది? ప్రవచింపరానిదేమున్నది? చేయదగిన దేమున్నది? చేయఁగూడనిదేమున్నది? అంతయును బ్రహ్మమేరా!

2. చదవదగిన దేమిటి? చదువరాని దేమిటి? సేవింపదగిన దేమిటి? సేవింప రానిదేమిటి? సర్వమును బ్రహ్మమే. (అంతయును బ్రహ్మముగా నెవనికి భాసింపుచున్నదో వానికి విధి నిషేధములుండవు).

3. తెలియదగినదేమిటి? తెలియరానిదేమిటి? తినదగిన దేమిటి? తినరాని దేమిటి? అంతటను బ్రహ్మమే నిండియున్నదిరా!

4. చేయవలసినదొక్కటే! అన్ని వేళలయందును - అన్ని చోటులయందును ముక్తి కారణమైన 'హంసధ్యానము - హంస ధ్యానమొక్కటియే' ఆచరింపవలెను. సర్వమును బ్రహ్మమే!

**హంసధ్యానము :** గాలిని లోనికి బీల్చుచు 'హం' అను అక్షరమును - విడుచుచు 'సో' అను అక్షరమును అనుసంధానము చేయవలెను.

'అనుసంధానము = వెంట తగుల్చుట! ఊర్పునకు వెనుకగా 'హం' అను అక్షరమును, నిట్టూర్పు వెంబడి 'సో' అను అక్షరమును భావించుట. ఇదియే హంసధ్యానము. ఇది బ్రహ్మానుభవమును గలిగించు ప్రక్రియ. విశేషములకు 'సూతసంహిత'ను పరిశీలించునది.

---

నవరోజ్ రాగః - ఆదితాళమ్

## 19. తద్వజ్జీవత్వమ్

తద్వజ్జీవత్వం
బ్రహ్మణి - తద్వజ్జీవత్వమ్.

1. యద్వత్తోయే చన్ద్రద్విత్వం
యద్వన్ముకురే ప్రతిబింబత్వమ్ ॥ తద్వత్॥

2. స్థాణౌ యద్వన్నరరూపత్వం
భానుకరే యద్వత్తోయత్వమ్ ॥ తద్వత్॥

3. శుక్తౌ యద్వద్రజతమయత్వం
రజ్జౌ యద్వత్ ఫణిదేహత్వమ్ ॥ తద్వత్॥

4. పరమహంసగురుణాద్వయవిద్యా
భణితాధిక్కృతమాయావిద్యా ॥ తద్వత్॥

**తాత్పర్యము :**

(బ్రహ్మమందు జీవభావము భ్రాంతిమూలము) - (బ్రహ్మము కంటె వేరైనది లేదు). జీవభావనము - బ్రహ్మమందు; బ్రహ్మమందు జీవభావనము అట్టిదయా!

1. నీటిలో ఇద్దరు చంద్రులు దోచుటలేదా? నిజముగా ఇద్దరు చంద్రులున్నారా? లేరు. బ్రహ్మమందు జీవభావనము అట్టిదయ్యా! (బ్రహ్మము కంటె వేరుగా జీవుడు లేడు. లేనే లేడు). అద్దమున ప్రతిబింబము కనబడుటలేదా? బ్రహ్మమున జీవభావమట్టిదే! (ప్రతిబింబమున్న తావుకూడ అద్దమే! అది అద్దముకంటె వేరైనది కాదు.)

2. దుంగయందు (భ్రాంతిచే) దొంగ దోచుచున్నాడు. సూర్యకిరణములే (భ్రాంతిచే) జలముగా దోచుచున్నవి. అట్లే బ్రహ్మమునందు జీవభావము భ్రాంతిచే జనించుచున్నది.

(ఉన్నది దుంగయే; దొంగలేడు. ఉన్నది సూర్యకిరణ ప్రసారమే; జలము లేదు. అట్లే ఉన్నది బ్రహ్మమే! జీవుడు లేడు!! అని భావము).

3. ముత్తెపు జిప్పలో వెండి నిండి యున్నట్లు తోచుచున్నది. త్రాటియందు సర్ప శరీరము భాసించుచున్నది. వాస్తవమునకు 'వెండి, పాము' రెండును లేవు. అట్లే బ్రహ్మమున జీవభావము తలయెత్తుచున్నది. బ్రహ్మము కంటె వేరేమియును లేదు.

4. ఇది అద్వయ బ్రహ్మవిద్య. పరమహంసలైన గురువర్యులు మాయా నిరాసకము; అవిద్యానాశకము అయిన ఈ విద్యను ప్రవచించినారు, ఘోషించినారు. బ్రహ్మమున జీవభావము భ్రాంతిమూలమేనయ్యా!

---

కల్యాణీరాగః - ఆదితాళమ్

## 20. పూర్ణబోధోఽహమ్

పూర్ణబోధోఽహం -
సదానన్ద - పూర్ణబోధోఽహమ్

1. వర్ణాశ్రమాచారకర్మాతిదూరోఽహం.
స్వర్ణవదఖిలవికారగతోఽహమ్ ॥ పూర్ణ॥

2. ప్రత్యగాత్మాహం ప్రవితతసత్యఘనోఽహం
శ్రుత్యన్తశతకోటిప్రకటితబ్రహ్మాహం
నిత్యోఽహమభయోఽహమద్వితీయోఽహమ్ ॥ పూర్ణ॥

3. సాక్షిమాత్రోఽహం ప్రగళితపక్షపాతోఽహం
మోక్షస్వరూపోఽహమోంకారగమ్యోఽహం
సూక్ష్మోఽహమనఘోఽహమద్భుతాత్మాహమ్ ॥ పూర్ణ॥

4. స్వప్రకాశోఽహం విభురహం నిష్ప్రపఞ్చోఽహం
అప్రమేయోఽహమచలోఽహమకలోఽహం
నిష్ప్రతర్క్యాఖణ్డైకరసోఽహమ్ ॥ పూర్ణ॥

5. అజనిర్మమోఽహం బుధజనభజనీయోఽహం
అజరోఽహమమరోఽహమమృతస్వరూపోఽహం
నిజపూర్ణమహిమని నిహిత మహితోఽహమ్ ॥ పూర్ణ॥

6. నిరవయవోఽహం నిరుపమనిష్కలఙ్కోఽహం
పరమశివేన్ద్రశ్రీగురుసోమసముదిత
నిరవధినిర్వాణసుఖసాగరోఽహమ్ ॥ పూర్ణ॥

**తాత్పర్యము :**

1. ఆహా! నాకు జ్ఞానోదయమైనది - ఆనందమయమై నిండైన ఏ జ్ఞానము నా యందు ఉదయించినదో - ఆ జ్ఞానమే నేను.

బ్రాహ్మణాది వర్ణములు - వర్ణములకు విధింపబడిన ఆచారములు నాకు లేవు. కరకంకణ - కర్ణభూషాదులుగా ఒకే బంగారము అనేక వికారములు చెందినట్లు - ఒక్క నేనే వివిధముగా గోచరించుచున్నాను. (నాకంటె వేరైనది లేదు. నిండైన జ్ఞానానందములే

నా రూపము).

2. అన్నిటికిని లోపలిదైన ఆత్మను నేను, (శరీరము – ఇంద్రియములు – మనస్సు – బుద్ధి – ఆత్మ – ఇవి ఒకదానికంటె ఒకటి లోపలివి) అనంతముగా విస్తరించి యున్న సత్యము యొక్క ఘనీభూతస్వరూపమే నేను.

('సత్యము' అనగా – నిజము, ఆడి తప్పకుండుట అన్నది లౌకికార్థము. వేదాంతమున సత్యము అనగా త్రికాలాబాధ్యమైనది. సృష్టి – స్థితి – లయముల యందును, అవి లేనపుడును – ఎన్నడును ఏది కొంచెము కూడ వికారమునకు లోను కాదో – అది సత్యము – అనగా బ్రహ్మము అని అర్థము.)

బహుళములైన ఉపనిషత్తులు ఏ పరబ్రహ్మమును బోధించుచున్నవో ఆ పరబ్రహ్మమే నేను! వెలితిలేని జ్ఞానానందములే నా రూపము.

3. నేను నిత్యుడను ఒకప్పుడుండుట – ఒకప్పుడు లేకుండుట నాకు లేవు. నాకు భయము లేదు. **"ద్వితీయాద్వై భయం భవతి"** – రెండవదియున్న భయము జనించును. రెండవది లేదు. ఉన్నది నేనొక్కడనే! నాకు భయము దేనివలన గల్గును? నేనద్వితీయుడను, రెండవది లేనివాడను. **'ఏకమేవాద్వితీయం బ్రహ్మ'** అని శ్రుతి నన్నే తెలుపుచున్నది. నేను జ్ఞానానందమయుడను.

నేను కేవలము సాక్షిని. ("సాక్షాత్ ద్రష్టా సాక్షీ" చూచిన వాడు. నాలో – నాకు వెలుపల ఏమిజరిగినను – జరుగుచున్నను – అది మంచియైనను చెడ్డయైనను నాకు దానితో లేశమును సంబంధము లేదు).

ఇద్దరు వ్యక్తులు వివాదపడుచున్నారు. ఏ వెలుగులో వారు వివాదపడుచున్నారో ఆ వెలుగునకు వారి వివాదముతో సంబంధమేమున్నది? జరుగుచున్న వివాదమునకు ఆ వెలుగు సాక్షి; అంతే! అట్లే నేను నా మనోబుద్ధ్యహంకారచిత్తాదులయందును – ఇంద్రియముల యందును – దేహమున – దేహమునకు బయటిదైన లోకమున జరుగు సర్వవిధ కృత్యములకు సాక్షిని. కేవలము సాక్షిని. ఏమి జరిగినను నా వెలుగులో జరుగుచున్నది. అంతే! నాకు ఆ జరుగుచున్న దానితో సంబంధము ఏమాత్రమును లేదు.)

ఇట్లగుటచేతనే నాకు పక్షపాతము లేదు. లోకము దేనిని సుఖమనుకొనుచున్నదో – అది సంభవింపలేదని బాధగాని, దేనిని దుఃఖముగా భావించుచున్నదో అది తొలగ లేదన్న ఆరాటముగాని నాలో లేవు. నేను సాక్షిమాత్రుడను గదా! అందుచేతనే – ఇది సంభవింపవలెనని – ఇది కలుగరాదని నేనెన్నడును భావింపను. ఇందువలననే నాకు

దేనియందును పక్షపాతము లేదు. మోక్షము నా స్వరూపమే! (తన్ను అనగా ఆత్మను తానెఱుంగుటయే మోక్షము. ఆ ఎఱుక జ్ఞానము. అజ్ఞానమే నా రూపము).

ఓంకారము నన్నే తెలుపుచున్నది. నేను సూక్ష్ముడను - మహత్తరుడను, **'అణోరణీయాన్ - మహతో మహీయాన్'** అని శ్రుతి నన్నే కీర్తించుచున్నది. నేను జ్ఞానానంద మయుడను!

4. నేను స్వయంప్రకాశశీలిని. (చూ. 17. తాత్పర్యములోని వివరణము) నా యందు ప్రపంచము లేదు. (ఉన్నది నేనే) ఇంత అని నన్ను గొలుచుట సాధ్యము కాదు. (బ్రహ్మ అనంతమైనది) నేనచలుడను. (దేహాదులకు చలనముగాని, బ్రహ్మమునకు చలనము లేశమును లేదు.) నేను నిష్కలుడను. (భాగరహితుడను).

నా రూపము తర్కమునకు అందదు. అది అఖండము - ఏకరసము. (బ్రహ్మము అనంతము - ఏకము. అందు ఖండములకు - ముక్కలకు - భాగములకు అవకాశము ఎట్లు? **'రసో వై సః - ఆనన్దం బ్రహ్మేతి వ్యజానాత్'** అనుచు శ్రుతిరసమే, ఆనందమే బ్రహ్మస్వరూపమని నన్నే కీర్తించుచున్నది.)

**జ్ఞానమయమైన ఆనందము నేనే!**

5. నేనజుడను (నాకు బుట్టుక లేదు). నేను నిర్మముడను (ఉన్నది నేనే కాని, నాకంటె వేరైనది లేశమును లేదు.)

జ్ఞానులైనవారికి నేనే సేవ్యుడను. (జ్ఞాని పరబ్రహ్మానుసంధానపరుడై యుండును. ఆ పరబ్రహ్మము నేనే!)

నేను మృతుడను. నేను నా వెలితిలేని నా మహామహిమయందే సుప్రతిష్ఠితుడనై యున్నాను.

**నేను నిత్యము జ్ఞానానందపరిపూర్ణుడను.**

6. నాయందు అవయవ విభాగము లేదు. నీకు సాటి వేరొకటి లేదు. నేను నిష్కలుడను.

శ్రీగురువులు పరమశివేంద్రులు శీతమయూఖుడువోలె (చంద్రుడువలె) అపారముగా వెల్లివిరియజేసిన బ్రహ్మానందసముద్రమే నేను!!

నేను జ్ఞానమయుడను! ఆనందమయుడను! **'బ్రహ్మైవాహమ్'.**

---

మధ్యమావతీరాగః - ఝంపతాళమ్

## 21. ఆనన్దపూర్ణ - బోధోఽహమ్.

ఆనన్దపూర్ణబోధోఽహమ్
సతతమానన్దపూర్ణబోధోఽహమ్

1. ప్రత్యగద్వైతసారోఽహం
సకలశ్రుత్యన్తతన్త్రవిదితోఽహమమృతోఽహం
మత్యనన్తరభావితోఽహం
విదితనిత్యనిష్కలరూపనిర్గుణపదోఽహమ్ ॥ ఆనన్ద॥

2. సాక్షిచిన్మాత్రగాత్రోఽహమ్
పరమమోక్షసామ్రాజ్యాధిపోఽహమమృతోఽహం
పక్షపాతాతిదూరోఽహం
అధికసూక్ష్మోఽహమనవధికసుఖసాగరోఽహమ్ ॥ ఆనన్ద॥

3. స్వప్రకాశైకసారోఽహం
సదహమప్రపంచాత్మభావోఽహమభయోఽహం
నిష్ప్రతర్క్యోఽహమమరోఽహం
చిదహమప్రమేయాఖ్యమూర్తిరేవాహమ్ ॥ ఆనన్ద॥

తాత్పర్యము :

1. ఆనందమయమైన జ్ఞానమే నా స్వరూపము! నిత్యానందమయమైన జ్ఞానమే నేను!! అన్నిటికిని అవ్వలిదైన ఆత్మస్వరూపము బ్రహ్మముకంటె వేరైనది కాదు.

ఉన్నది బ్రహ్మమొక్కటియే! రెండవది లేనే లేదు. అట్టి అద్వైతజ్ఞానసారమే నేను. ఉపనిషత్తులు తంత్రశాస్త్రములు నన్నే కీర్తించుచున్నవి! నేనమృతుడను! (శరీరము – ఇంద్రియములు – మనసు – బుద్ధి – ఇవి ఒకదాని కంటె ఒకటి లోపలివి. **'బుద్ధేరాత్మా మహాన్ పరః'** బుద్ధికి అవ్వలిభాగమున ఆత్మ ప్రకాశించుచున్నది. బుద్ధికి అవ్వల భావితమైన స్వరూపమే – ఆత్మయే – బ్రహ్మమే– నేను!) నిత్యముగా (సర్వకాలము వెలయునదిగా) నిరవయవిగా (అఖండముగా) నిస్త్రైగుణ్యముగా (సత్వ – రజస్తమోగుణములు లేనిదిగా) తెలియబడుచున్న స్థానమే నేను! **నిత్యానందమయమైన జ్ఞానమే నేను.**

2. నేనన్నిటికిని సాక్షిని మాత్రమే! (చూ. 20. తాత్పర్యము) నేను జ్ఞానమాత్ర శరీరిని! మోక్ష సామ్రాజ్యముకంటె గొప్పది లేదు. నేనా సామ్రాజ్యమునకు అధీశుడను! ఏలికను! నేనమృతుడను! (నాకు మరణము లేదు).

నేనన్నిటికిని సాక్షినిగదా! అందుచే నాకు సుఖమున పక్షపాతముగాని దుఃఖమున ద్వేషముగాని లేదు. పక్షపాతము నాకు చాలా దవ్వైనది! నేనణువుకంటెను సూక్ష్మమైన వాడను! నేనపారమైన ఆనన్దజలరాశిని! **నిత్యానందమయమైన జ్ఞానమే నేనే!!**

స్వయంప్రకాశకమైన వస్తువుయొక్క (బ్రహ్మముయొక్క) సారమే నేను సత్తు నేను! (త్రికాలాబాధ్యమైనది సత్తు.) ప్రపంచమన్నది లేని ఆత్మభావము నేనే! భయమన్నది నాకు లేదు!

ఇట్టిది – అట్టిది అని తర్కించుటకు వలనుగాని వస్తువేది కలదో – అదే (బ్రహ్మమే) నా రూపము! నేనమరుడను! 'ఇంత – అంత' అని కొలుచుటకు శక్యముగాని స్వరూపమేది యున్నదో – అది (బ్రహ్మము) నేను!

**ఆనందపూర్ణమైన బోధము – జ్ఞానము – అదే నేను!!**

---

శఙ్కరాభరణరాగః - మిశ్రతాళమ్

## 22. ఆనన్దపూర్ణ - బోధోఽహమ్.

ఆనన్దపూర్ణబోధోఽహం
సచ్చిదానన్దపూర్ణబోధోఽహమ్.

1. సర్వాత్మచరోఽహం పరినిర్వాణ-
నిర్గుణనిఖిలాత్మకోఽహమ్
గీర్వాణవర్యానతోఽహం కామగర్వ-
నిర్వాపణధీరతరోఽహమ్ ॥ ఆనన్ద॥

2. సత్యస్వరూపోఽహం వర శ్రుత్యన్త-
బోధితసుఖసాగరోఽహం
ప్రత్యగభిన్నపరోఽహం శుద్ధమన్తు-
రహితమయాతీతోఽహమ్ ॥ ఆనన్ద॥

3. అవబోధరససాగరోఽహం వ్యోమ-
పవనాదిపఞ్చభూతాతిదూరోఽహం
కవివరసుసేవ్యోఽహం ఘోర భవసిన్ధు-
తారకపరమసూక్ష్మోహమ్ ॥ ఆనన్ద॥

4. బాధితగుణకలనోఽహం
బుద్ధిశోధితసమరసపరమాత్మాహం
సాధనజాతాతీతోఽహం నిరుపాధిక-
నిస్సీమభూమానన్దోహమ్ ॥ ఆనన్ద॥

5. నిరవయవోఽహమజోహం
నిరుపమ మహిమని నిహితమహితోఽహం
నిరవధిసత్వఘనోఽహం
ధీరపరమశివేన్ద్రశ్రీగురుబోధితోఽహమ్ ॥ ఆనన్ద॥

**తాత్పర్యము :**

ఆనందము నేను! జ్ఞానము నేను!! వెలితి లేని సచ్చిదానందములు నేను!!! నేను శివుడను!

సర్వుల ఆత్మయందును నేనున్నాను. (జీవులకు నానాత్వము ఆత్మకు ఏకత్వము) పరిపూర్ణమైన మోక్షము నేను. నేను నిర్గుణుడను! అందరియొక్క ఆత్మగాను ఉన్నది నేనే!

దేవవర్యులు నాకు మ్రొక్కుదురు. కాముని గర్వమునకు చెల్లుచీటి వ్రాసిన ధీరుడను నేను. (ఆత్మజ్ఞానముదయింపనంతవరకే కోరిక లుండును! ఆత్మజ్ఞానసంపన్నునియందు కోరిక అన్నది పేరుకు గూడ మిగిలియుండదు. **'ఆత్మానం చేద్ విజానీయాదయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్.'**)

నిండుగా వెల్లివిరిసిన సచ్చిదానందములు నేను!

2. త్రికాలాబాధ్యవస్తువుగా బేర్కొనబడి అన్నిటి కంటెను బరమైన దేది కలదో – ఆ వస్తువు – ఆ బ్రహ్మము నేనే! శ్రుత్యంతములైన ఉపనిషత్తులు **'ఆనన్దం బ్రహ్మేతి వ్యజానాత్'** అని దేనిని సుఖరూపముగా వర్ణించుచున్నవో – ఆ అనంత సుఖసాగరమే నేను.

అన్నిటికిని లోనిదైన ఆత్మకంటె (ప్రత్యగాత్మ) వేరుకానిదైన పరబ్రహ్మము నేనే! నాకు పరసంపర్కము లేశమును లేదు. ఏవిధమైన క్లేశములును నాకు లేవు. నేను మాయాతీతుడను.

అంతటను నిండియున్న సచ్చిదానందములు నేను!

జ్ఞానరససముద్రమే నేను! ఆకాశాది పంచభూతములకును నేను చాల దూరమందున్నాను.

మహాకవులు నన్నే సేవించుచున్నారు. (వారి కవితా వస్తువు నేనే) ఘోరమైన సంసారసముద్రమును దాటించు పరమసూక్ష్మవస్తువు – **'అణోరణీయాన్, మహతో మహీయాన్'** అని కీర్తితమైన పరబ్రహ్మము నేను!

నిండుగా నంతటను బ్రకాశించు సచ్చిదానందములు నేను!

4. ఎచట సత్త్వరజస్తమస్సులు పూర్తిగా బాధింపబడునో – అనగా ఎచట నవి తల ఎత్తుటకు వీలు లేదో – ఆ స్థానము పరబ్రహ్మము. అది నేనే!

శుద్ధమైన బుద్ధిచే 'ఇది కాదు – ఇది కాదు' అనుచు అన్నిటిని త్రోసివేయగా నెయ్యది త్రోసివేయుటకు వీలుకానిదై మిగిలియుండునో ఆ సమరసమైన పరమాత్మ నేనే!

**సర్వమైన సాధన సామాగ్రికిని అవ్వల నేను ప్రకాశించుచున్నాను.**

సాధకుడు బ్రహ్మనిష్ఠుడై ప్రకాశించుటకు నాల్గు సాధనములు ఆవశ్యకములని

వేదాంతశాస్త్రములు తెలుపుచున్నవి. ఆ సాధనములు **1. వివేకము, 2. వైరాగ్యము, 3. శమాదిషట్కము, 4. ముముక్షుత.**

**1. వివేకము :** బ్రహ్మవస్తువొక్కటియే సత్యము. ఇతరమెల్ల అనిత్యమే, అసత్యమే అని ఒకదాని నుండి వేరొక దానిని వేరుచేసి గ్రహించుట.

**2. వైరాగ్యము :** దేహము మొదలు బ్రహ్మ (సృష్టికర్త) వరకైన సమస్తములైన భోగ్యవస్తువులయందును – ఏహ్యాభావము – జుగుప్స  అనిష్టము – పరాఙ్ముఖత వైరాగ్యమనబడును.

**3. శమాదిషట్కము :** శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము, ఈ ఆరును శమాది షట్కమనబడును.

1. శమము : అంతరింద్రియమైన మనసును అదుపులోబెట్టుట.
2. దమము : జ్ఞానేంద్రియకర్మేంద్రియనిగ్రహము.
3. ఉపరతి : మనసుయొక్క వృత్తి – శబ్దస్పర్శాది విషయముల ఆకారమును ధరింపకుండుట.
4. తితిక్ష : సంభవించిన దుఃఖమును నివారించుటకు ఏ ప్రయత్నమును ఆచరింపక సహించుట.
5. శ్రద్ధ : శాస్త్రమున గురువాక్యమున సత్యత్వబుద్ధి.
6. సమాధానము : బుద్ధిని శుద్ధబ్రహ్మపదార్థమున లెస్సగా నిలుపుట.

**4. ముముక్షుత :** మోక్షప్రాప్తికైన తీవ్రేచ్ఛ.

(ఇట్లు చెప్పబడిన సాధనచతుష్టయముచే నేను (బ్రహ్మము) అనుభవింపబడుదునని భావము)

ఏ ఉపాధియును లేని సీమారహితమైన భూమానందము (బ్రహ్మానందము) నేను!

సచ్చిదానందములు నేను! శివుడు నేను!

5. నేనఖండుడను! నేనజుడను! సాటిలేని స్వీయమైన మహామహిమయందు సుప్రతిష్ఠితుడను నేను! నేను మహితుడను!

---

సురటి రాగః - ఆదితాళమ్

## 23. జయ - తుఙ్గతరఙ్గే.

జయ తుఙ్గతరఙ్గే!
గఙ్గే! - జయ తుఙ్గతరఙ్గే!

1. కమలభవాణ్డకరణ్డపవిత్రే!
బహువిధబన్ధచ్ఛేదలవిత్రే! ॥ జయ॥

2. దూరీకృతజనపాపసమూహే!
పూరితకచ్ఛపగుచ్ఛగ్రాహే! ॥ జయ॥

3. పరమహంసగురుభణితచరిత్రే!
బ్రహ్మవిష్ణుశఙ్కరనుతిపాత్రే! ॥ జయ॥

**తాత్పర్యము :**

1. మహాతరంగ పరిశోభితాగంగా! జయ! వివిధములైన సంసారబంధములను ఛేదించు లవిత్రమవైన (కొడవలి) గంగా! తుంగతరంగా! జయ!

2. లోకుల పాతకములనెల్ల దూరమునకు తరిమివేయు గంగా! తాబేళ్లతో - వివిధ జలచరములతో నిండియున్న తుంగ తరంగా! జయ!

3. పరమహంసలైన గురువులచే (సదాశివబ్రహ్మేంద్రుల గురువులు) కీర్తింపబడిన చరిత్ర కల గంగా! బ్రహ్మ, విష్ణు - మహేశుల సన్నుతికి పాత్రమవైన ఓ భాగీరథీ! జయ!

(ఉరకలు పెట్టి వచ్చుచున్న బ్రహ్మజ్ఞానప్రవాహమే గంగ!) (ప్రతి కీర్తనలోను హంస - పరమహంస శబ్దములచే గీర్తింపబడినవారు శ్రీపరమశివేంద్రసరస్వతీ మహాస్వామి - సదాశివబ్రహ్మేంద్రుల గురువులు)

జయోఽస్తు శ్రీసదాశివబ్రహ్మేన్ద్రస్వామిభ్యః
విజయోఽస్తు తద్గురుభ్యః
శ్రీ పరమశివేన్ద్రసరస్వతీమహాస్వామిభ్యః
శుభం భూయాత్

ఇతి శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రకీర్తనాని
సంపూర్ణమ్.

శ్రీః

# శ్రీ శివ మానసికపూజా స్తుతిః



శ్లో॥ అనుచితమపలపితం మే
త్వయి నను శంభో! తదాగసః శాన్త్యై ।
అర్చాం కథమపి విహితా–
మఙ్గీకురు సర్వమఙ్గలోపేత! ॥ 1

**ప్రతిపదార్థము :** నను–శంభో = ఓయి శంకరా!, త్వయి = నీయెడ, మే = నాయొక్క (నాచే), అనుచితమ్ – అపలపితమ్ = అనుచితం భాషింపబడెను, తత్ + ఆగసః – శాన్త్యై = ఆ పాపముయొక్క పరిహారమునకై, సర్వమంగల + ఉపేత! = సర్వమంగళతో గూడిన స్వామీ!, కథమపి = ఏదోరీతిగా, విహితామ్ = ఆచరింపబడిన, అర్చామ్ = పూజను, అఙ్గీకురు = స్వీకరింపుము.

**తాత్పర్యము :** స్వామీ! శంకరా! నేనింతవరకు నిన్ను గూర్చి అనుచితములే భాషించి పాపమునే మూట గట్టితిని. ఏ సర్వమంగలాపతీ! ఇదుగో! ఆ పాపపరిహారమునకై నా బుద్ధికి దోచిన విధానమున (అది అశాస్త్రీయమే కావచ్చును) నిన్ను అర్చింపబూనుకొంటిని, నాయీ పూజను స్వీకరింపుము.

**వివరము :** ధ్యానము – ఆవాహనము – ఆసనము – పాద్యము మున్నగు ఉపచారములు సాధారణులయెడ జెల్లును. విశ్వమయుడు, చిన్మయుడు అయిన పరమేశునియెడ ఇట్టి ఉపచారములు ఆ స్వామియొక్క సర్వవ్యాపకత్వమునకు – మనోవాగతీతస్థితికి – అద్వయత్వమునకు భంగము కలిగించుటలేదా! అందుచే **'ధ్యాయామి – ఆవాహయామి – ఆసనం సమర్పయామి'** ఇత్యాదులు శివుని విషయమున అనుచిత క్రియలే – అనుచిత భాషణములే. స్తుతికర్తలు శ్రీ సదాశివబ్రహ్మేంద్రులవారు – లోకమొనర్చు షోడశోపచార రూపమైన శివపూజనమును తనయందారోపించుకొని **'అనుచిత మపలపితం మే'** అనినారు. శివుని సర్వాతిశయస్వరూపమును సాక్షాత్కరింపజేయుచు వారు పలుకబోవు స్తుతికి – ఇది అవతారిక వంటిది.

---

శ్లో॥ ధ్యాయామి కథమివ త్వాం
ధీవర్త్మవిదూరదివ్యమహిమానమ్ ।
ఆవాహనం విభోస్తే
దేవాగ్ర్య! భవేత్ ప్రభో! కుతః స్థానాత్ ॥ 2



**ప్రతిపదార్థము :** దేవాగ్ర్య! = సర్వ దేవతలకును ఆదియైన ఓ ప్రభూ!, ధీపర్త్మ .... .... మహిమానమ్ = బుద్ధియొక్క మార్గమునకు, విదూర = మిక్కిలి దూరమందున్న, దివ్య మహిమానమ్ = దివ్యమైన మహత్త్వముగల, త్వామ్ = నిన్ను, కథమివ = ఎట్లుగా, ధ్యాయామి = ధ్యానింతును?, విభోః = సర్వవ్యాపకుడవై అంతటను నిండియున్న, తే = నీయొక్క, ఆవాహనమ్ = ఆవాహనము, కుతః స్థానాత్ = ఏచోటనుండి, భవేత్ = సంభవమగును.

**తాత్పర్యము :** సనాతనమూర్తీ! బుద్ధి వైభవమునకు అందని మహా మహిమగల నిన్ను ధ్యానించుట ఏవిధముగ సాధ్యమగును? సర్వవ్యాపివై అంతటను నిండియున్న నిన్ను ఏచోట నుండి ఎచటకు రమ్మని ఆహ్వానింతునయ్యా ప్రభూ! అది కూడా సంభవము కాదు.

**వివరము :** పరమాత్మ స్వరూపమును వాక్కులచే వర్ణించుట, మనసుచే చింతించుట, సాధ్యము కాదు **'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'** – అని శ్రుతి. సర్వేంద్రియములతో సహా అంతఃకరణవృత్తులన్నియు శాంతించిన మీదట మాత్రమే తెలియవచ్చు మహిమగల వానిని – ధీవృత్తిని జాగృతమొనర్చి ధ్యానమున జిక్కబట్టుదు ననుట' అవివేకము అనుచితము. ఒకచోట నున్న వానిని 'అయ్యా! ఇటు దయసేయుము అని లేనిచోటకు ఆహ్వానించుట ఉచితమే. కాని అంతటను నిండియున్న వానిని 'ఇటు దయసేయుమయ్యా! అని ఆహ్వానించుటలో ఔచిత్యమేమున్నది? ఆ పిలువబడు ప్రభువు – మనము ఎచటనుండి రమ్మనుచున్నామో – ఆచోటనే కాక – మనమెచటికి రమ్మనుచున్నామో – ఆ తావునగూడ – మనము పిలుచుటకు ముందే నిండియున్నాడు గదా! అట్టియెడ – 'అచ్చట ఉన్న స్వామీ! ఇచ్చటకు రావయ్యా!' అని ఆహ్వానించుట యుక్తమా? వాస్తవ మిట్లుండుటచే పరమేశుని గూర్చిన **ధ్యానము, ఆవాహనము** – రెండును అసంభవములే. పరమేశుని మనోవాచామగోచరత్వమును, సర్వవ్యాపకత్వమును భావించి అనుభవించుట మాత్రమే మనము చేయగల పని.

---



**శ్లో॥ కియదాసనం ప్రకల్ప్యం**
**కృతాసనస్యేహ సర్వతోఽపి శివ! ।**
**పాద్యం కుతోఽర్ఘ్యమపి వా**
**ఽఽపాద్యం సర్వతః పాణిపాదస్య ॥ 3**

**ప్రతిపదార్థము :** హే శివ = ఓ శివా!, సర్వతః + అపి = అంతటను, కృత + ఆసనస్య = విరచితాసనుడవైన నీకు, ఇహ = ఇచట, కియత్ + ఆసనమ్ = ఎంత ఆసనము, ప్రకల్ప్యమ్ = కల్పింపదగినది, సర్వతః పాణిపాదస్య = అంతటను కాలుసేతులుగల నీకు, కుతః = ఎటనుండి, పాద్యం వా = కాళ్ళు కడుగుకొనుటకైన నీరుకాని, అర్ఘ్యమ్ + అపి

వా = చేతులు శుభ్రపరచుకొనుటకైన, జలముకాని, ఆపాద్యమ్ = తీసుకొనివచ్చి ఏర్పాటు చేయవలయును?

**తాత్పర్యము :** ఇచట – అచట అనికాక అంతటను స్థిరాసనాసీనుడైన స్వామికి ఎంత ఆసనమును కల్పించుట? దానిని ఎచటనుండి తెచ్చుట? ఇవి రెండును అసంభవములే!

స్వామి పాదములు ఇచట ఉన్నవి, అచట లేవు – అని లేదు. అట్లే ఆయన చేతులును. ఆయన సర్వతఃపాణిపాదుడు. అట్టివానికి అర్ఘ్య – పాద్యముల నెచటినుండి తెచ్చి ఆపాదింపగలము?

**వివరము : 'సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోరుహమ్'** – అని శ్రుతి. సాధారణుల విషయమున 'ఇవి కాళ్ళు – ఇవి చేతులు' అని నిర్దేశించి చూపగలము. అంతటను పాణిపాదములతో నిండి యున్నవాడు పరమాత్మ. అందుచే ఆ స్వామికి అర్ఘ్య పాద్య సమర్పణము అసంభవమే, ఆయన మహిమను అవమానించుటయే – అగును.

**'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః'** లోన – వెలుపల అంతటను వ్యాపించి నారాయణు డున్నాడు అని శ్రుతి. (నారాయణుడు శివుని కంటె వేరుకాదు) అట్టి మహేశుని గూర్చి – **'ఆసనం సమర్పయామి'** అనుట అవిచారిత రమణీయమే కాని సుసంగత మెట్లగును? స్వామియొక్క విభుత్వమును భావించి అనుభవింపవలెనని ఉపదేశము.

---

**శ్లో॥ ఆచమనం తే స్యాదపి**
**భగవన్! భవ! సర్వతో ముఖస్య కథమ్ ।**
**మధుపర్కో వా కథమిహ**
**మధువైరిణి దర్శితప్రసాదస్య ॥ 4**



**ప్రతిపదార్థము :** భగవన్ – భవ = దేవా! శంకరా!, సర్వతః + ముఖస్య తే = అన్ని యొడల ముఖములున్న నీకు, ఆచమనమ్ + అపి = ఆచమనార్థమైన జలమైనను, కథం = ఎట్లు, స్యాత్ = సమకూడును?, మధువైరిణి = మధువుతో విరోధించిన వానియందు (శ్రీహరియందు), దర్శితప్రసాదస్య = చూపబడిన అనుగ్రహము గల నీకు, మధుపర్కో వా = మధుపర్కమైనను (పెరుగుతో కలిపిన తేనె), ఇహ = ఇచట, కథమ్ = ఎట్లు తగును?

**తాత్పర్యము :** స్వామీ! విశ్వముఖుడవైన నీకు ఆచమనార్థ జలమైనను సమర్పించుట ఎట్లు సాధ్యము? మధువిరోధి యెడ ప్రీతిని గనబరచిన నీకు 'మధుపర్క' సమర్పణము మాత్రము సమంజసమా?

**వివరము : 'చమ – భక్షణే'** అని ధాతువు, లెస్సగా త్రావబడునది యగుటచే ఆచమనము. ఒకటో రెండో నోళ్ళున్న వానికి ఆచమనమునకు జలమందిపగలము. కాని అన్నియెడలను మొగములున్నవానికి – మనమిచ్చు జలములో – మన చేతిలో కూడా మొగములున్న వానికి ఆచమనమునకై జలమిచ్చుట సంభవమా? ఈ హేతువుచే – పరమేశుని గూర్చిన షోడశోపచారపు విధి యందు **"ఆచమనీయం సమర్పయామి"** అనుట అనుచితమే అగుచున్నది.

'మధువు' అనగా తేనె, అంతేకాక అది ఒక రాక్షసుని నామధేయము కూడ. ఆ రాక్షసుని హరి సంహరించెను. అందుచే హరి మధువైరి – మధుసూదనుడు అని పేరొందెను.

శివుడు మధువిరోధి (హరి) యెడ ప్రసన్నుడు. అనగా మధువునకు శత్రుపక్షము వాడు. అట్టివానికి మధుపర్క సమర్పణము – అనిష్ట వస్తువు నిచ్చుట యగుచున్నది కదా! అను భావము ఇచట శ్లేషచే సంపాదింపబడెను.

ఇట్లీ స్తుతియందంతటను మనము సాగించు పరమేశుని గూర్చిన షోడశోపచార పూజనము – అకృతమతియైన బాలకుని చర్యవంటిదే కాని, అర్థమైన చర్య కాదనియు, పరిశీలింపగా ఈ ఉపచారములు ఆ స్వామియెడ జేయు అపచారముల వంటివే అనియు నిరూపించుచు– శివ స్వరూపము, తన్మహిమము అనుభవైకవేద్యములని తెల్లము సేయబడెను.

---



**శ్లో॥ స్నానేన కిం విధేయం**
**సలిలకృతేనేహ నిత్యశుద్ధస్య ।**
**వస్త్రేణాపి న కార్యం**
**దేవాధిపతే! దిగంబరస్యేహ ॥ 5**

**ప్రతిపదార్థము :** నిత్యశుద్ధస్య = సదా పరిశుద్ధుడవై యుండు పరమేశునకు నీకు, ఇహ = ఇచట, సలిలకృతేన = ఉదకముచే విరచితమైన, స్నానేన = స్నానముచే, కిం విధేయమ్ = ఆచరింపదగినదేమున్నది? హే దేవాధిపతే! = ఓ వేలుపుల నేలు స్వామీ, దిక్ + అంబరస్య = దిక్కులే కట్టుబట్టగా గల నీకు, ఇహ = ఇట, వస్త్రేణ + అపి = వస్త్రముతో గూడ, న కార్యమ్ = పనిలేదు.

**తాత్పర్యము :** ఓ పరమేశా! నిత్యము శుద్ధుడవై యుండు నీకు స్నానముతో బని యేమున్నది? దిగంబరుడవుగా నుండు నీకు వస్త్రముతో బని ఏమున్నది.

**వివరము : 'స్నానం సమర్పయామి – వస్త్రం సమర్పయామి'** అని రెండు పూజోపచారములు. అవి శివుని విషయమున వ్యర్థములని ఇందు నిరూపింపబడె.

మాలిన్యము అంటిన చోట దానిని తొలగించుటకు గదా స్నానము? మాలిన్యము లేశమైనను ఎన్నడును ఎవనికి అంటదో - అట్టి నిత్యశుద్ధునకు స్నానమేమి క్రొత్త ప్రయోజనము కలిగించును?

స్వామి దిగంబరుడు. అట్టివానికి వస్త్రము దేనికి? అందుచే అదియును నిరర్థకమే.

దిగంబర శబ్దమునకు దెసలే కట్టుబట్టగా గలవాడని, నగ్నుడని అర్థము. దిక్కులు స్వామికి వస్త్రము గనుక - దిక్పాలురు స్వామియొక్క కట్టుబట్టకు కావలివారగుచున్నారు.

ఒకానొక కవి 'శాటీపాలాః - శతముఖముఖాః' అనినాడు. అనగా 'ఇంద్రాదులు శివుని గోచీని కావలికాయువారు' అని అర్థము. కాగా పరమేశునకు వస్త్రముతో బనిలేదు. అనంతుడైన ఆయన శరీరమును జుట్టి వచ్చుటకు తగిన వస్త్రమును సమర్పించుట కూడా అసంభవమే. శివుని అనంతమైన మహిమా విభవమును తెలియజేయుటయే స్తుతికర్తల ఆశయం.

---

**శ్లో॥ స్ఫురతి హి సర్వాభరణం**
**సర్వాఙ్గే సర్వమఙ్గలాకార! ।**
**అతివర్ణాశ్రమిణస్తే**
**ఉస్త్యుపవీతే నేహ కశ్చిదుత్కర్షః ॥ 6**



**ప్రతిపదార్థము :** సర్వమఙ్గలాకార! = సర్వవిధముల శుభాకృతివై ఓ మహేశా!. సర్వాఙ్గే = నీ సర్వాంగముల యందును, సర్వాభరణమ్ = సర్వాభరణము, స్ఫురతిహి = మెఱయుచున్నది కదా!, అతివర్ణాశ్రమిణః + తే = వర్ణములను - ఆశ్రమములను మీఱియున్న నీకు, ఇహ = ఇచట, ఉపవీతే = ఉపవీత సమర్పణమున, కశ్చిత్ = ఒకానొక, ఉత్కర్షః = గొప్పదనము, న = లేదు.

**తాత్పర్యము :** శివా! శుభాకృతివైన నీకు సర్వాంగముల యందును సర్వాభరణములు ముందుగనే వెలసియున్నవి. ఇట్టి నీకు నాగాభరణసమర్పణములో అర్థమేమున్నది? బ్రాహ్మణాది వర్ణములను - బ్రహ్మచర్యాది ఆశ్రమములను మీరి ప్రకాశించు నీకు యజ్ఞోపవీతము తెచ్చు ఘనత ఏమున్నది?

**వివరము :** శివపూజనమున **'నాగాభరణం సమర్పయామి'** అని ఒక ఉపచారము. పాదాంగదములుగా - మొలత్రాడుగా - కరకంకణములుగా - భుజకీర్తులుగా - కంఠ హారములుగా - కర్ణకుండలములుగా - జటాబంధముగా పాములనే సొమ్ములుగా దాల్చి యున్నవానికి నాగాభరణసమర్పణము ఉపచారమెట్లగును?

నాలుగు వర్ణములకు – నాలుగాశ్రమములకు అవ్వలివాడై ప్రకాశించు మహేశునకు, యజ్ఞోపవీతము నిచ్చుట ద్వారా – ఆయనను వర్ణాశ్రమములలోనికి దెచ్చినట్లై ఆ స్వామి ఘనతను తగ్గించినటులగుచున్నది. భావింపగా ఇదియును తగిన ఉపచారము కాదనిపించుచున్నది. స్వామియొక్క మహిమాతిశయమును గ్రహించి చింతించి **శివోఽహం** భావనచే తరింపుడని ఉపదేశము.

---



శ్లో॥ **గంధవతీ హి తనుస్తే**
**గంధాః కిం నేశ! పౌనరుక్త్యాయ ।**
**పుష్కర ఫలదాతారం**
**పుష్కరకుసుమేన పూజయే కిం త్వామ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** హే ఈశ! = ఓ ప్రభూ, తే తనుః = నీ శరీరము, గంధవతీ హి = సుగంధము గలది కదా (అట్టి నీకు), గంధాః = గంధ సమర్పణము, పౌనరుక్త్యాయ = పునరుక్తికై, న కిం = కాదా?, పుష్కర ఫలదాతారమ్ = పుష్కలముగా ఫలితమును ప్రసాదించు, త్వామ్ = నిన్ను, పుష్కరకుసుమేన = తామరపూవుతో, కిం పూజయే = ఏమి పూజింతును?.

**తాత్పర్యము :** ఓ పరమేశా! నీ శరీరమే సహజముతో పరిమళించుచుండగా నే సమర్పించు ఈ గంధము దేనికి? ఇది పునరుక్తియే గదా! పుష్కలముగా ఫలదాతవైన నిన్ను పుష్కరముతో తామరపూవుతో పూజించుట ఎట్లు ఉచితమగును?

**వివరము :** చెప్పినదానినే చెప్పుట పునరుక్తి. ఇది దోషము. దీని ఫలితార్థమును గ్రహించి – అన్నదానినే ఇచ్చుట యందును ఈ శబ్దమును వాడుచుందురు. పరమేశుని శరీరము సహజసుగంధయుక్తము. దానికి గంధ సమర్పణము పునరుక్తియే కదా! అది దోషమే కదా! 'పుష్కరము' అనగా తామరపూవు. సంస్కృత భాషలో 'ర – ల' లకు భేదము లేదు. అనగా పుష్కర – పుష్కల శబ్దాలకు భేదము లేదు.

శివుడున్నాడు. ఆయన తన్ను సేవించువారలకు పుష్కర ఫలితమును ప్రసాదించును. ఆయన ఇచ్చునది 'పుష్కరఫలం' అయినపుడు మనము సమర్పించునది పుష్కర పుష్పం అయినపుడు ఈ సమర్పణ యుక్తమా? **'ఫలమాయన – పూవు మనము'** అనుచితముగా లేదా? 'ఇలా భావించి సాధారణ షోడశోపచార పూజ కంటె పై మెట్టుకు చేరకొమ్ము' అన్నది స్తుతికర్తల ఉపదేశము.

---

శ్లో॥ శమధనమూలధనం త్వం
సకలేశ్వర! భవసి ధూపితః కేన ।
దీపః కథం శిఖావాన్
దీప్యేత పురః స్వయంప్రకాశస్య ॥ 8



**ప్రతిపదార్థము :** హే సకలేశ్వర! = ఓ మహేశా!, త్వం = నీవు, శమధన = శాంతియే ధనముగా గల మనులకు, మూలధనం = మూలవిత్తమై యున్నావు (అట్టినీవు), కేన = దేనిచే, ధూపితః = ధూపితుడవగుదువు?, స్వయంప్రకాశస్య = ఇతరాపేక్ష లేకయే ప్రకాశించు నీయొక్క, పురః = పురోభాగమున, దీపః = దీపము, కథమ్ = ఎట్లు, దీప్యేత = ప్రకాశించును?.

**తాత్పర్యము :** మునులు శమధనులు వారికి మూలధనమైయున్న నీకు ఓ స్వామీ! ఏ విధమున ధూపమర్పింపగలను? ఎట్లు ధూపితు నొనర్పగలను? స్వయంప్రకాశశీలివైన నీ యెదుట కొడిగట్టు దీపమేమి వెలుగులు జిమ్మగలదు?

**వివరము :** తాము సంపాదించుకొను విత్తము చెల్లిపోయినపుడు మూలధనమును కదిపి సమస్యను నివారించుకొనుచుందురు, ఇది లోకపరిపాటి. మునులకు శమమే ధనము. శమమనగా శాంతి. దానికి ఒక లోపము వచ్చినపుడు వారుకూడ తమ మూలధనమును (శివుని) ఆశ్రయింతురు. ఆశ్రయించి తిరిగి శమధనులు అగుచుందురు.

**'ధూపం సమర్పయామి'** అని అగురవత్తి వెలిగించుచుందుము. 'ధూప – సంతాపే' ధూపమనగా తపింపజేయునది. బాలెంతలకు, పసిబిడ్డలకు స్నానానంతరము సాంబ్రాణి ధూపముతో జుట్టు తడి ఆర్చుచుందురు. శమధనులుశమమునకు లోపము కలిగిన భర్తీ చేయువాడు శివుడు. అట్టి శమస్థానమును దేనితో ధూపితము (తాపితం) చేయగలము!.

కాగా ఈ ఉపచారం హిమనదములో అగ్గిపుల్ల విసురుట వంటిది.

ఇక **'దీపం దర్శయామి'** అనే ఉపచారమున్నది. సూర్యుడుదయించెనో లేదో తెలిసికొనుటకు దీపము తీసికొని వెళ్ళరు. అలాగే ఎవనిచే సూర్యచంద్రులు ప్రకాశించు చున్నారో, **'యస్య భాసా సర్వమిదం విభాతి'** అట్టి స్వయంప్రకాశశీలుని ఎదుట కొడిగట్టే దీపముంచుట ఏమి ఉపచారము?

'పరమేశ్వరుడు నీ దేవతార్చన పెట్టెలో ఇమిడి ఉన్నాడు' అనుకొంటే – నీవు సాధనలో 'ఒ.న.మ' లలోనే ఉన్నట్లు. ఆయన మహిమాతిశయాన్ని గుర్తించు. లే! మేలుకో! అద్వయానందప్రాప్తికైన మార్గములో దృఢముగా అడుగుపెట్టు. అని ఉపదేశము.

---

శ్లో॥ అమృతాత్మకమపి భగవ-
న్నశనం కిం నామ నిత్యతృప్తస్య ।
త్వయ్యామ్రేడితమేతత్
తాంబూలం యదిహ సుముఖరాగేఽపి ॥ 9



**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ స్వామీ, నిత్యతృప్తస్య = నిత్యతృప్తుడవైన నీకు, అమృతాత్మకమ్ + అపి = అమృతము వంటిదే అయినను, అశనమ్ = ఆహారము, కిం నామ = ఎందులకు?, సుముఖరాగే = చక్కని ముఖరక్తిమ గల, (సజ్జనులయందును రాగముగల), త్వయి = నీ విషయమున, ఇహ యత్ తాంబూలమ్ = ఇచట ఏ తాంబూల సమర్పణము జరుగుచున్నదో, ఏతత్ + అపి = ఇది కూడ, ఆమ్రేడితమ్ = పునరుక్తియే!.

**తాత్పర్యము :** స్వామీ! అమృతాహారమైనను – నిత్యతృప్తుడవైన నీకు క్రొత్తగా కలిగించు ప్రయోజనమేమున్నది? చక్కని ముఖరాగముగల నీకు తాంబూలము పునరుక్తియే.

**వివరము : 'ఆకలితో నున్నవానికి అన్నము తృప్తినిచ్చును' – 'తృప్తాః స్థ? తృప్తా స్మః'** అన్నట్లు కడుపునిండి తృప్తి చెందియున్న వారికి, అమృతమైనను అక్కరలేనిదే.

పరమేశుడు నిత్యతృప్తుడు. ఆయనకు మన మర్పించు అన్నాదినివేదనము – కడుపునిండిన వాని యెదుట పెట్టబడిన కదన్న కబళమే. (కదన్నము = కుత్సితాన్నము) అందుచే **'నైవేద్యం సమర్పయామి'** అనెడి ఉపచారము ఈశుని ఎదుట నిరర్థకమే అగుచున్నది.

**'సుముఖరాగే'** – సుముఖులు అనగా చక్కని ముఖము గలవాడు. శివుని గీర్తించు ముఖమే సుముఖము. శివభక్తులే సుముఖులు. వారియందనురాగము గలవాడని ఒక అర్థము. చక్కని ముఖరక్తిమ గలవాడని వేరొక అర్థము.

సుముఖరక్తునకు అన్నపుడు శ్లేషచే రెండర్థములును సమావిష్టములగును. వానికి తాంబూలము 'ఆమ్రేడితము' కాగలదన్నాము. **'ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తం'** ఒకే దానిని రెండు మూడు మారులు పలుకుట ఆమ్రేడితము. ఎఱ్ఱని దానిపై ఎఱుపురంగు ఆమ్రేడితమే కదా!

సుముఖరక్తునకు తాంబూలము తెచ్చిపెట్టు క్రొత్త శోభ ఏమియును లేదు. అందుచే ఇదియును ఉపచారము కాదు.

ఈ విధముగా శివపూజలో– **'ధ్యానము మొదలు తాంబూలము'** పర్యంతము సర్వోపచారములు బాలక చేష్టితములే – అవిచారిత రమణీయములే – అని నిరూపించి నీరాజన విషయమున స్తుతికర్త క్రొత్త దారిని త్రొక్కుచున్నారు.

---



శ్లో॥ ఉపహారీ భూయాదిద-
ముమేశ! యన్మే విచేష్టితమశేషమ్ ।
నీరాజయామి తమిమం
నానాత్మానం సహాఖిలైః కరణైః ॥ 10

**ప్రతిపదార్థము :** హే ఉమేశ = ఓ పార్వతీపతీ, మే = నాయొక్క, అశేషం = సమస్తమైన, విచేష్టితమ్ = విశేషక్రియ, యత్ = ఏది కలదో, ఇదమ్ = ఇదంతయు, ఉపహారీభూయాత్ = నీకు ఉపహారమగు గాక, నానా + ఆత్మానమ్ = అనేక రూపములతో నున్న, తమ్ + ఇమమ్ = ఆయీ నిన్ను, అఖిలైః కరణైః సహ = నా అన్ని ఇంద్రియములతోడను, నీరాజనయామి = ప్రకాశింపజేయుచున్నాను.

**తాత్పర్యము :** ఓ ఉమాపతీ! నా సర్వమైన చేష్టలను (కదలికలను) నీకు కానుక పెట్టుచున్నాను.

నానారూపములతో గోచరించు నిన్ను ఇదుగో! నా సర్వేంద్రియములతోడను నీరాజితు నొనర్చుచున్నాను.

**వివరము :** తినుట – తిరుగుట – నిద్రించుట – భాషించుట – ఇత్యాదులు మన చేష్టలు – అపుడు మనము 'నేను తినుచున్నాను, నేను త్రావుచున్నాను' అనియే భావించుచున్నాము.

అట్లు కాక ఓ స్వామీ! నా యీ 'నేను' నీవే. నాయీ సంచారము నీకొనర్చు ప్రదక్షిణమే. (తిరుగుచున్నవాడు.) దేని చుట్టును దిరుగుచున్నామో అదియును శివాదన్యము కాదు. 'నేను తినుట – నీకు ఆహుతిని సమర్పించుట', 'నా నిద్ర నిన్నొందుటకైన సమాధి.' అని భావించుటయే సర్వవిచేష్టితములను శివునకు కానుక పెట్టుట.

"ఆత్మా త్వం గిరిజామతిః సహచరాః ప్రాణాః శరీరం గృహం,
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః, స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్."
– శ్రీ శఙ్కరభగవత్పాదాః.

పరమేశుడు నానాత్ముడు. శబ్ద – స్పర్శ – రూప – రస గంధాత్మకమైన ప్రపంచము, తదితరము సర్వము శివరూపమే. కన్ను చూచుచున్నది. చెవి ఆలకించుచున్నది. అనుకొనుచున్నాము. కాని వాస్తవమునకు చూచునది కన్ను కాదు. ఆలకించునది చెవికాదు. అవి కేవలం గోళకములు. పొయ్యిమీద పెట్టగా అన్నము ఉడుకుచున్నది. కాని ఉడికించునది పొయ్యికాదు, అగ్ని. పొయ్యిలో జ్వలించిన అగ్నియే వచనక్రియను సాగించుచున్నది.

అట్లే కంటిలో దూరి చూచుచున్నవాడు శివుడే, చెవిలో దూరి ఆలకించుచున్నది పరమేశుతేజమే. ఇట్లే సర్వేంద్రియ క్రియలును సాగుచున్నవి. ఇది యథార్థము – ఈ

భావనను చెదరనీయక సాగించుటయే - ఈశ్వరు నింద్రియములతో నీరాజించుట.

"నేత్రాదిజాలకోపాన్తే హృత్పద్మాసనలీలయా ।
వారం వారం త్వయా దేవి రూపాదిమధు సేవ్యతే ॥"

అమ్మా! నీవే కన్ను అనెడి కిటికీ వద్ద పద్మాసనాసీనవై సర్వమును తిలకించుచున్నావు. అని నాడొక సిద్ధుడు.

---

**శ్లో॥ సుమనశ్శేఖర! భవతే**
**సుమనోఽఞ్జలిరేష కో భవేచ్ఛంభో! ।**
**ఛత్రం ద్యుమన్ ద్యుమూర్ధ్నః**
**చామరమపి కిం జితశ్రమస్య తవ ॥ 11**



**ప్రతిపదార్థము :** హే సుమనశ్శేఖర! = దేవదేవా!, శంభో! = శంభూ!, ఏషః సుమనోఽఞ్జలిః = ఈ పుష్పాంజలి, భవతే = నీకై, కః భవేత్ = ఏమగును గనుక, ద్యుమన్! = సర్వాకాశ వ్యాప్త విగ్రహుడవైన స్వామీ!, ద్యుమూర్ధ్నః = ఆకాశమే శిరముగాగల నీకు, ఛత్రమ్ = గొడుగు, జితశ్రమస్య తవ = శ్రమను జయించిన నీకు, చామరమ్ + అపి = వింజామరము కూడ, కిమ్ = ఏమగును. (ఏమి ప్రయోజనము కలిగించును).

**తాత్పర్యము :** దేవదేవుడవైన నీకీ పుష్పాంజలి నర్పించుటచే ఏమిచ్చినటు లగును? సర్వమైన ఆకాశమును వ్యాపించియున్న నీకు - ఆకాశమే శిరము గాగల నీకు ఛత్రధారణమెవడు సేయుగలడు? జితశ్రమునకు నీకు చామరవీజనము ఏమి ప్రయోజనము కలిగించును?

**వివరము : పుష్పాంజలిం సమర్పయామి - ఛత్రం ధారయామి - చామరేణ వీజయామి -** అనెడి ఉపచారములు వాస్తవమైన శివస్వరూపమును గుర్తించనంతవరకే ఉపచారములని ఇందు నిరూపించినారు. సుమనశ్శబ్దమునకు **'దేవతలు, పూవులు'** అని రెండర్థములున్నవి. 'సుమనశ్శేఖర' అనగా 'దేవశిరోమణి - అద్భుత పుష్పరాజము' అని అర్థములు. సుమనశ్శేఖర విషయమున సుమనోఽఞ్జల్యర్పణము ఉచితక్రియ ఎట్లగునని శ్లేషచే సాధించిన ఆక్షేపణము.

**'ఆకాశశ్చికురాయ తే దశదిశాభోగో దుకూలాయ తే'** అని ఆకాశము స్వామి యొక్క జుట్టుగా కీర్తింపబడినది గదా! ఆకసమే శిరముగా గలవానికి గొడుగు పట్టుట ఎట్లు? అని ఛత్రధారణమును గూర్చియు - శ్రమపడినవానికి వింజామరము సుఖమిచ్చును. అసలు శ్రమయే లేనివానికి వింజామరము దేనికి? అనిచామర వీజనమును గూర్చియు ఆక్షేపణము.

---



**శ్లో॥ నృత్యం ప్రథతాం కథమివ**
**నాథ! తవాగ్రే మహానటస్యేహ ।**
**గీతం కిం పురవైరిన్!**
**గీతాగమమూలదేశికస్య పురః ॥ 12**

**ప్రతిపదార్థము :** మహానటస్య తవ = నటరాజువైన నీయొక్క, అగ్రే = ఎదుట, ఇహ = ఇచట, నృత్యమ్ = నృత్యము, కథమివ ప్రథతామ్ = ఎట్లు ప్రసిద్ధమగును?, హే పురవైరిన్ = ఓ త్రిపురద్వేషీ!, గీతాగమ మూల దేశికస్య పురః. గీత = గానము చేయబడిన, ఆగమ మూల = వేదమూలముగల, దేశికస్య = గురుడవైన నీయొక్క, పురః = ఎదుట, గీతమ్ – కిమ్ = గీతము (పాట) ఏమిటయ్యా?

**తాత్పర్యము :** నటరాజువైన నీ యెదుట నాట్యమా! అదేమి విలువను దెచ్చును? ఆగమ మూలమెవ్వనిచే గీతమో, అట్టి దేశికేంద్రుని ఎదుట గీతమా? అదేమి పేరుదెచ్చును?

**వివరము : 'నృత్యం దర్శయామి – గీతం శ్రావయామి'** అను ఉపచారముల వ్యర్థత ఇందు నిరూపింపబడెను. **స్వామి నటరాజు.** స్వామి గీతాగమమూలదేశికుడు. గీతాగమము అనగా సామవేదమనియు అర్థము. సామవేదము నుండియే సంగీతము పుట్టెను. అట్టి సామవేదమునకే మూలమైనవాడు స్వామి. **'యస్య నిశ్వసితం వేదాః'** – అని శ్రుతి (వేదములు పరమేశుని నిట్టూర్పులు). అందుచే నృత్యదర్శనము – గీతా గానము అనునవి స్వామి యొక్క మహామహిమను గుర్తింపనంతవరకే ఉపచారములని తెల్లము చేసినారు.

---

**శ్లో॥ వాద్యం డమరుభృతస్తే**
**వాదయితుం వాఽపరేఽస్తి కా శక్తిః ।**
**అపరిచ్ఛిన్నస్య భవే-**
**దఖిలేశ్వర! కః ప్రదక్షిణవిధిస్తే ॥ 13**



**ప్రతిపదార్థము :** డమరుభృతః = డమరువును దాల్చిన, తే = నీకు (ఎదుట), వాద్యమ్ వాదయితుమ్ = వాద్యము వాయించుటకు, అపరే = ఇతరునియందు, కా శక్తిః + అస్తి = సామర్థ్యమేమున్నది?, హే అఖిలేశ్వర! = ఓ సర్వేశ్వరా, అపరిచ్ఛిన్నస్య = అనంతుడవైన, తే = నీకు, ప్రదక్షిణవిధిః = ప్రదక్షిణమొనర్చుట, కః = ఏమిటయ్యా.

**తాత్పర్యము :** ఎల్లవేళల డమరువును ధరించి వాద్యవిద్యాచార్యుడవైన నీ ఎదుట వాద్యమెవరు వాయింపగలరు? అనంతుడైన నిన్ను ప్రదక్షిణించుట ఎట్లు?

**వివరము : వాద్యోపచారము – ప్రదక్షిణక్రియ** – ఇందు ఆక్షేపింపబడెను. ఇతరము స్పష్టము.

---



**శ్లో॥ స్యుస్తే నమాంసి కథమివ**
**శఙ్కర! పరితోఽపి విద్యమానస్య ।**
**వాచామగోచరే త్వయి**
**వాక్ప్రసరో మే కథం ను సంభవతు ॥ 14**

**ప్రతిపదార్థము :** హే శఙ్కర! = ఓ శంకరా!, పరితః = అంతటను, విద్యమానస్య = ఉన్న, తవ = నీకు, నమాంసి = నమస్కారములు, కథమివ స్యుః = ఎట్లు అగును (కుదురును), వాచామ్ + అగోచరే = వాక్కులకందని, త్వయి = నీ యెడ, మే = నా యొక్క, వాక్ప్రసరః = వాక్ప్రసారము, కథం ను = ఎట్లు, సంభవతు = సంభవించును!.

**తాత్పర్యము :** ఓ శంకరా! అంతటను నిండియున్న నీకు నమస్కరించుట – వాక్కులకందని నీయెడ వాగ్వినియోగము సాధ్యమా?

**వివరము :** మన ఎదుటనున్నవానికి మనము మ్రొక్కగలము. మన ఎదుట – వెనుక – పార్శ్వములయందు – ఊర్ధ్వాధో భాగముల మాత్రమే గాక – మనయందును నిండియున్న వానికి మ్రొక్కుట ఎట్లు?

మన ఇంద్రియములున్నవి. వాని వెనుక మనస్సు – దాని వెనుక బుద్ధి – **'బుద్ధేరాత్మా మహాన్ పరః'** – బుద్ధికి వెనుక ఆత్మ (శివుడు) ఉన్నారు. వాక్కు అనునది ఇంద్రియము. అది బహిఃప్రసరణ శీలము. అది తానెటనుండి ఆవిర్భవించుచున్నదో, దానికిని దవ్వైనచోటనున్నవాని యందెట్లు ప్రసరించును?

**'యతో వాచో నివర్తన్తే – అప్రాప్య మనసా సహ'** – శ్రుతి. ఇట్లు నమస్కారము – వాక్కులచే వర్ణించుట – అనునవి సర్వేశ్వరు మహామహిమము గుర్తించినపుడు ఉపచారములు కానేరవని ఇందు నిరూపింపబడెను.

---

**శ్లో॥ నిత్యానన్దాయ నమో**
**నిర్మలవిజ్ఞానవిగ్రహాయ నమః ।**
**నిరవధికరుణాయ నమో**
**నిరవధివిభవాయ తేజసేఽస్తు నమః ॥ 15**



**ప్రతిపదార్థము :** నిత్యానన్దాయ = సదా ఆనందమయుడైన వానికై, నమః = నమస్కారము, నిర్మలవిజ్ఞానవిగ్రహాయ = నిర్మలజ్ఞానమే రూపుగా గల సామికై, నమః = దండము, నిరవధికరుణాయ = అపారకరుణామూర్తికై, నమః = ప్రణామము, నిరవధివిభవాయ = హద్దులేని వైభవముగల, తేజసే = తేజము కొరకు, నమః అస్తు = ప్రణిపాతము అగుగాక!.

**తాత్పర్యము :** అనవరత మానందమయుడైన వానికి దండము – నిర్మల జ్ఞాన శరీరికి మ్రొక్కు. నిస్సీమ కరుణామూర్తికి దోయిలి, అవధిలేని విభవముగల స్వామికి అంజలి.

**వివరము :** ఇపుడేకదా అనంతుడైన మహేశునకు మ్రొక్కుట అసంభవము అనినారు. మరల వెంటనే ఈ నమస్కారములేమి? అని శంక. 'నమః' అను శబ్దమును రెండుగా విడదీసి – (న + మః) 'మః = జీవుడు, న = కాను' అని అర్థము చెప్పుదురు. నమశ్శబ్దమునకు వెనుకనున్న చతుర్థీ విభక్తికి ఏకత్వమును అర్థముగా చెప్పుదురు.

**'శివాయ నమః'** అన్నపుడు – మః = జీవుడు, న = కాను, శివాయ (ఏకత్వముచే) – శివుడనే అని అర్థము. ఇచటను అట్టి అర్థమునే గ్రహించవలెను. (వెనుకటి ఆక్షేపణము సాధారణార్థముననే చెల్లును) నిత్యానందమే నేను, నేను జీవుడను కాను. నిర్మలజ్ఞానమే నా రూపు. నిస్సీమ కరుణామూర్తితో – అపారవైభవస్ఫూర్తితో నాకు ఏకత్వము. అని భావము.

---



**శ్లో॥ సరసిజవిపక్షచూడః**
**సగరతనూజన్మసుకృతమూర్ధాసౌ ।**
**దృక్కూలంకషకరుణో**
**దృష్టిపథే మేఽస్తు ధవళిమా కోఽపి ॥ 16**

**ప్రతిపదార్థము :** సరసిజవిపక్షచూడః. సరసిజ = తామరలకు, విపక్ష = శత్రువైనవాడు (చంద్రుడు), చూడః = జడలయందు గలవాడు, సగర.... .... మూర్ధా. సగర = సగరుని, తనూజన్మ = పుత్రులపాలిటి, సుకృత = పుణ్యమైనది (గంగ), మూర్ధా = శిరమునగల, ఆసౌ = ఈ, దృక్ + కూలంకషకరుణః – దృక్ = కన్నుల, కూలంకష = కడలనురాయు, కరుణః = కరుణగల, కః + అపి = ఒకానొక, ధవళిమా = ధావల్యము (తెల్లదనము), మే = నాయొక్క, దృష్టిపథే = దృష్టిమార్గమున, అస్తు = వెలయును గాక!.

**తాత్పర్యము :** జడలలో చంద్రుని తురుముకొన్నది. సగరపుత్రుల సుకృతపరీపాకమైన గంగను తలపై ధరించిన – కరుణ చిందు కన్నులుగలది – అయిన ధవలతేజమొకటి నా కనుల యెడ సాక్షాత్కరించుగాక!

**వివరము :** ఇంతవరకు విశ్వమయుడు ఆత్మాభిన్నుడు అయిన మహేశుని మహిమాతిశయమును గీర్తించి – ఇపుడు కొంచెము దిగివచ్చి, పురాణకథా ప్రసిద్ధమైన మహేశమూర్తిని తన పురోభాగమున ఉన్నట్లు భావించి స్తుతించుచున్నారు.

కపిలుని కోపాగ్నికి బూదిగా మారిన సగరకుమారులు భగీరథుడు తెచ్చిన గంగచే

తరించిరి. అందుచే గంగ సగర కుమారుల సుకృత పరీపాకమైనది. పరమేశుడు తెల్లనివాడు. 'ఇది ఇట్టిది' అని నిర్వచించుటకు వీలు కానిదగుటచే **"కోఽపి"** ఒకానొక – అని పేర్కొనబడెను. పరమేశుని ధావల్యము పరమేశునకు ఉపలక్షకము.

---

శ్లో॥ **జగదాధారశరాసం**
**జగదుత్పాదప్రవీణయన్తారమ్ ।**
**జగదవనకర్మఠశరం**
**జగదుద్ధారం శ్రయామి చిత్సారమ్ ॥ 17**



**ప్రతిపదార్థము :** జగదాధార శరాసమ్ – జగత్ + ఆధార = లోకములకు ఆధారమైనది (మేరువు), శరాసమ్ = విల్లుగాగలవానిని, జగదుత్పాద.... .... యన్తారమ్. జగత్ = లోకములను, ఉత్పాద ప్రవీణ = సృష్టించుటయందు నేర్పుగలవాడు (బ్రహ్మ), యన్తారమ్ = సారథిగా గలవానిని, జగదవన .... .... శరమ్, జగత్ = లోకములను, అవన కర్మఠ = రక్షించు పనిలో, శూరుడైనవాడు (హరి), శరమ్ = బాణముగా గలవానిని, జగత్ + ఉద్ధారమ్ = లోకోద్ధారకుని, చిత్సారమ్ = జ్ఞానసారుడైన శివుని, శ్రయామి = ఆశ్రయించుచున్నాను.

**తాత్పర్యము :** మేరు పర్వతమును విల్లుగాబూని, నారాయణుని బాణముగా చేగొని – సృష్టికర్తను రథసారథిగా స్వీకరించి – త్రిపురాసురులపై దండెత్తిన – జగదుద్ధారకుని, జ్ఞానసారుని నేనాశ్రయించుచున్నాను.

**వివరము :** లోకములన్నియు మేరువును ఆధారముగాను గొని నిలిచిన యున్నవి. భూలోకమునకే కాదు, స్వర్గాది ఊర్ధ్వలోకములకు, పాతాళమువరకైన అధోలోకములకు కూడ మేరువే ఆధారము.

త్రిపురాసుర సంహారమునకు సన్నద్ధుడైన మహేశుని చేతిలో ఆ మేరువే విల్లై వంగినది. భూమి రథమై – సూర్యచంద్రులు రథచక్రములై – వేదములు ఆ రథమును లాగు గుఱ్ఱములై ఒప్పినవి. సృష్టి కార్యదక్షుడైన బ్రహ్మ రథసారధి కాగా – లోకరక్షాధురీణుడైన నారాయణుడే స్వామి చేతిలో శరమయ్యెను. ఇదంతయు త్రిపురాసురసంహారమునకైన స్వామి సంగ్రామ యాత్రా సన్నాహము.

స్థూల – సూక్ష్మ – కారణ శరీరములే త్రిపురములు. వాని యందు 'నేను – నేను' అను తాదాత్మ్యభావనలే అసురులు. సాధకుని వెన్నుపూసయే మేరువు. 'ఇడ – పింగళ' నాడులే సూర్యచంద్రులు, మనసే బ్రహ్మ. మూలాధారమునుండి సాగు ప్రణవనాద ప్రశాంతావస్థయే నారాయణుడు.

అనగా ఉత్తమసాధకుడు సమకాయశిరోగ్రీవుడై కూర్చుండి – ఏకాగ్రచిత్తుడై మూలాధారమునుండి సహస్రారమువరకు ఎడతెగక ఓంకారనాదమును అనుసంధానము చేయుచు వచ్చినచో – స్థూల – సూక్ష్మ – కారణ శరీరములతో వానికి అంతవరకు సజీవముగా నున్న తాదాత్మ్యము – అసురత్రయము రాలిపోవును. వాడు జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు అవ్వలిదైన తురీయమును జేరి భవబన్ధవిముక్తుడై ప్రకాశించును.

ఈ సాధనమందు మనస్సే (మనో – బుద్ధి – చిత్త – అహంకార రూపమైన అంతఃకరణమే) **చతుర్ముఖబ్రహ్మ,**

గుఱ్ఱములు రథమును లాగినట్లు సాధక మనోనివిష్టమైన వేద ధర్మాచరణ ప్రవృత్తియే ఈ పనిని ముందుకు సాగించును. ఇట్లు స్థూలమైన మఱియు సూక్ష్మమైన త్రిపురాసుర కథాసారము ఇందు సంస్మరింపబడెను.

'శ్రి – శ్రయే' ఆశ్రయించుట. అనగా పట్టుకొనుట కాదు, తాను – అది ఒకటి అగుట, ఉత్తమసాధకుడు దృఢదీక్షతో సాధనమార్గమున బ్రవర్తిల్లి తురీయావస్థను జేరుకొన్ననాడు ఆ సాధకుడు శివుడే అగును.

స్తుతికర్తలైన శ్రీ సదాశివబ్రహ్మేంద్రులవారు – తమకు నిత్యానుభవసిద్ధమైన – 'స్థూల – సూక్ష్మ – కారణ' శరీరములను దాటి తురీయమును జేరుకొనుటకైన సాధన విధానముననే ఇందానందముతో వర్ణించియున్నారు.

---



**శ్లో॥ కువలయసహయుధ్వగలైః**
**కులగిరికూటస్థకుచభీరార్ధాఙ్గైః ।**
**కలుషవిదూరైశ్చేతః**
**కబలితమేతత్ కృపారసైః కైశ్చ ॥ 18**

**ప్రతిపదార్థము :** కువలయ – నల్ల కలువలతో, సహయుధ్వ = పోటీపడు, గలైః = కంఠముగల, కులగిరి .... .... ర్ధాంగైః కులగిరి = కులపర్వతములకు, కూటస్థ = మూలపురుషుడైన మేరువు వంటి, కుచభీర = రొమ్ములతో నొప్పుచున్న అర్ధాఙ్గైః = అర్ధ శరీరముగాగల, కలుషవిదూరైః = కాలుష్యమునకు మిక్కిలి దవ్వున నున్న, కైశ్చ – కృపారసైః = అనిర్వచనీయ, కృపారస ప్రవాహములచే, మే = నాయొక్క, ఏతత్ = ఈ, చేతః = మానసము, కబళితమ్ = కబళముగా గొనబడెను (మింగబడెను – తినబడెను)

**తాత్పర్యము :** నల్లకలువలతో పోటీపడు కంఠచ్ఛాయతో బంగరు కొండలవంటి రొమ్ముల జంటతో నొప్పుచున్న ఉమాదేవిచే ఆక్రాంతమైన అర్ధదేహముతో – పాప దూరమై ప్రకాశించు

అనిర్వచనీయ కృపాప్రవాహములు – నా చిత్తమును కబళించినవి.

**వివరము :** 'నా చిత్తమును ఉమేశుడాహరించినాడు. కాగా నాకు వేరే చిత్తము లేదు. చిత్తమే లేదుగాన శివాదన్యమైన భావము లేశమును నాయందు లేదు'. అని స్తుతికర్తలు అనుచున్నారు.

"తల్లియొక్క రొమ్ము బలముగా ఎత్తుగా ఉండుట – బిడ్డకు కావలసిన పోషక ద్రవ్యము సమృద్ధిగా కలదని సూచించును. జగజ్జనని యైన ఉమాదేవికి ఈ లోకమంతయు సంతానమే, అట్టి తన సంతానమైన జగత్తును లౌకికముగా ఆధ్యాత్మికముగా పోషించుటకు తగిన ద్రవ్యము ఆమెయందు నిండుగా ఉన్నదనుటకై – రొమ్ములను అలా ఎత్తుగా వర్ణించుట జరిగినది – ఇదంతయు జగత్పోషక ద్రవ్య సమృద్ధి సూచకము.

స్వస్వరూపము కంటె అన్యమైనదానితోడి సంపర్కము కాలుష్యము. అనగా – మసిగిన్నెను శుభ్రముగా తళతళ మెఱయునట్లు తోమి కడిగినాము. గిన్నెయందు మసిలేదు. కాలుష్యము తొలగినది అనుకొనుచున్నాము. కాని గిన్నె కంటె వేరైన నీటితడి దానికంటి యున్నంత వరకు అది 'శుద్ధము' అనబడదు. అటులే సంసారాసక్తిని బెంచు కామక్రోధములే కాదు – వానిని పరిహరించుటకు ఉపయోగించు చిత్తవృత్తి కూడ దూష్యమైనదే, అది కూడ శాంతింపవలెను.

ఏ చీపురుతో గదిని శుభ్రమొనర్చినారమో – ఆ చీపురును మూలబడవేసి చేతులు కడుగుకొనవలెను. సాధకుడు వైరాగ్య ప్రబోధకమైన ఏ చిత్తవృత్తిని రేకెత్తించి – కామ క్రోధములను సంసారాసక్తిని అవ్వలకు నెట్టివేసినాడో – ఆ వైరాగ్య ప్రబోధక చిత్తవృత్తి కూడ కాలుష్యమే. స్వస్వరూప ఉపలబ్ధియందు ప్రతిబంధకమే. అదికూడ శాంతింపవలెను.

పరమేశుడు 'కలుషవిదూరుడు' అనగా నిస్తరంగసముద్రమువలె శాంతుడు అని అర్థము.

---

**శ్లో॥ వసనవతే కరికృత్త్యా**
**వాసవతే రజితశైలశిఖరేణ ।**
**వలయవతే భోగభృతా**
**వనితార్ధాంగాయ వస్తునేఽస్తు నమః ॥ 19**



**ప్రతిపదార్థము :** కరికృత్త్యా = గజచర్మముచే, వసనవతే = వస్త్రముగలదై, రజితశైలశిఖరేణ = వెండికొండ కొమ్ముచే, వాసవతే = నివాసవంతమై, భోగభృతా= పడగగలవానిచే (సర్పముచే), వలయవతే = కంకణవంతమై, వనితార్ధాంగాయ = ఆడుదానిచే అర్ధదేహియైన, వస్తునే = వస్తువు కొరకు, నమః – అస్తు = నమస్కారమగుగాక!.

**తాత్పర్యము :** గజచర్మాంబరధరము, కైలాసశిఖరావాసము - సర్పకంకణము - అర్థాంగీకృతదారము అగు వస్తువును బ్రస్తుతించుచున్నాను.

**వివరము :** శబ్ద - స్పర్శ - రూప - రస గంధములు విషయములు. అడవులలో వృక్షవైవిధ్యమున్నది. అట్లే వీనియందును వైవిధ్యమున్నది. అందుచే ఇవి విషయారణ్యములు.

అడవిలోనికి బోవు మదగజమువలె నిలుపరానిదై మానసము విషయారణ్యముల యందు విహరించుచుండును. అట్టి మనోరూపమైన మత్తగజము నిష్ప్రాణమై - నిశ్చల తను భజించిన ఉత్తర క్షణమందే స్వామి సాక్షాత్కరించును. అనుభవమునకు వచ్చును. అంతవరకు తల ఎత్తి ఉన్న 'నేను' అంతర్ధానమై - ఆనందసాగరము నందనంత విహారమారంభమగును.

అందుచే స్వామిని గజచర్మధరుడన్నారు. **'సర్పకంకణుడు - వనితార్థాంగుడు'** వీని వివరము సాధకుడు కొన్ని మెట్లెక్కి వచ్చినపుడు మాత్రమే తెలియును.

---



**శ్లో॥ సరసిజకువలయజాగర-**
**సంవేశనజాగరూకలోచనతః ।**
**సకృదపి నాఽహం జానే**
**సురమితరం భాష్యకారమఞ్జీరాత్ ॥ 20**

**ప్రతిపదార్థము :** సరసిజ .... .... .... లోచనతః. సరసిజ = తామరపూవులను, కువలయ = కలువ పూవులను, జాగర = మేలుకొలుపుట యందు, సంవేశము = నిద్రబుచ్చుటయందు, జాగరూక = జాగ్రత్త వహించినవారు (సూర్యచంద్రులు), లోచనతః = కన్నులుగా గలవాని కంటె, భాష్యకార = వేదాంతభాష్యకారులైన, మఞ్జీరాత్ = పాదాంగదములుగల స్వామికంటె, ఇతరం సురమ్ = వేరు దైవమును, అహమ్ - న - జానే = నేనెఱుగను.

**తాత్పర్యము :** సూర్యచంద్రులే కన్నులుగా గల - వేదాంత సూత్ర భాష్యోక్తులను నినదించు కాలి అందెలు గల - వేలుపు దొర కంటె, వేఱు దైవతమును నేనెఱుంగను.

**వివరము :** సూర్యుడుదయింపగా తామరలు వికసితములగును, కలువలు ముకుళితము లగును. చంద్రుడుదయింపగా తామరలు వికాసమును గోల్పోయి, కలువలు వికసితము లగును. అట్టి సూర్యచంద్రులే స్వామి కన్నులు. ఈ సూర్యచంద్రులు స్థూలజగత్తునందే కాదు, సాధకుని పిండాండమున గూడ ఉన్నారు.

"హృదయస్థా రవిప్రఖ్యా శిరఃస్థితా చంద్రనిభా" -లలితాసహస్రము.

సాధకుడు తన పిండాండమున సూర్యచంద్రులను దర్శింపగల్గెనేని, మహేశుని ప్రసన్నదృక్కులు వానిపై బ్రసరించినటులే. ఎవరైన వచ్చుచున్నపుడు వారి రాకకంటె ముందు వారి కాలి సవ్వడి కర్ణగోచరమగును. బ్రహ్మసూత్రభాష్యోక్తులు పరమేశుని పాదమంజీరధ్వనులే. అనగా – సూత్రభాష్యమందాసక్తి – పరమేశుని రాకకు సూచకము.

---

**శ్లో॥ ఆపాటలజాటానా-**
**మానీలాచ్ఛాయకంధరాసీమ్నామ్ ।**
**ఆ పాండువిగ్రహాణా-**
**మాదృహిణం కిఙ్కరా వయం మహసామ్ ॥ 21**



**ప్రతిపదార్థము :** ఆ పాటల జాటానాం = అంతటను ఎఱుపువన్నెకు దిరిగిన జడలు గల, ఆనీల + ఛాయకంధరాసీమ్నాం. ఆనీలచ్ఛాయ = అంతటను నలుపు వన్నె నాకలించుకొన్న, కంధరాసీమ్నామ్ = కంఠదేశముగల, ఆపాండువిగ్రహాణామ్. ఆపాండు = అంతటను తెలుపు వన్నెతో ఒప్పుచున్న, విగ్రహాణామ్ = ఆకృతిగల, మహసామ్ = తేజములకు, ఆద్రుహిణమ్ = బ్రహ్మకల్పపర్యంతము, వయమ్ = మేము, కింకరాః = కింకరులము – (సేవకులము)

**తాత్పర్యము :** జడలయందెఱుపు – కంఠమున నలుపు – దేహమున తెలుపు అయిన తేజములను – బ్రహ్మదేవుని ఆయువు చెల్లిపోవు వరకు మేము సేవింతుము.

**వివరము :** 'తెలుపు – ఎఱుపు – నలుపు' సత్త్వ–రజ–స్తమో గుణ సూచకములు. శివుడు కదలని తమోగుణము – వెలవెలబాటిన రజో గుణము – తళతళలాడు సత్త్వగుణము కలవాడని అర్థము.

**సాధకునియందు తమోగుణము చలనరహితమైనపుడు – రజోగుణము దాదాపు నిర్జీవమైనపుడు – శుద్ధ సత్త్వము ధగధగ మెఱయజొచ్చినప్పుడు మాత్రము శివసాయుజ్య లాభమని ఉపదేశము.**

---



**శ్లో॥ ముషితస్మరావలేపే**
**మునితనయాయుర్వదాన్యపదపద్మే ।**
**మహసి మనో రమతాం మే**
**మహతి దయాపూరమేదురాపాఙ్గే ॥ 22**

**ప్రతిపదార్థము :** ముషిత స్మర + అవలేపే, ముషిత = హరింపబడిన, స్మర = మదనుని,

అవలేపే = గర్వముగల, ముని .... .... పద్మే, మునితనయ = ముని కుమారునకు (మృకండు పుత్రునకు) ఆయుః + వదాన్య = ఆయువును దానము చేసిన, పదపద్మే = పాదపద్మముగల, దయా + ఆపూర .... పాంగే. దయాపూర = కరుణారసముచే, మేదుర = దట్టమైన, అపాఙ్గే = కడగంటి చూపులు గల, మహతి మహసి = గొప్ప వెలుగులో, మే మనః = నా మానసము, రమతామ్ = క్రీడించుగాక!.

**తాత్పర్యము :** కాముని గర్వాతిశయమును కాలరాచిన వెలుగులో – మార్కండేయున కమితాయుర్దాయము ననుగ్రహించిన మహస్సులో – కరుణారసముట్టిపడు కడగంటి చూపులున్న కాంతి పుంజములో – నా మానసము రమించుగాక!.

**వివరము :** శివారాధనము సేయక కామమును నిర్జింపలేదు; అపమృత్యువును దొలగించు కొనలేదు, ఆయువును పెంచుకొనలేదు.

---

**శ్లో॥ శర్మణి జగతాం గిరిజా–**
**నర్మణి సప్రేమహృదయపరిపాకే ।**
**బ్రహ్మణి వినమద్రక్షణ–**
**కర్మణి తస్మిన్నుదేతు భక్తిర్మే ॥ 23**



**ప్రతిపదార్థము :** జగతాం శర్మణి = లోకములకానందమై, గిరిజానర్మణి = ఉమాదేవి యొక్క శృంగార పరిహాసమున, సప్రేమ.... పాకే. సప్రేమ = ప్రేమతో గూడిన, హృదయ పరిపాకే = హృదయ పరిపాకమై, వినమత్.... కర్మణి. వినమత్ = మ్రొక్కువారికి, రక్షణకర్మణి = రక్షించు పనిగలవాడైన, తస్మిన్ = ఆ, బ్రహ్మణి = బ్రహ్మమందు, మే = నాకు, భక్తిః ఉదేతు = భక్తి ఉదయించుగాక!

**తాత్పర్యము :** జగదానందమై – ఉమాదేవి యొక్క నర్మోక్తికి ప్రేమతో నిండిన యెదదగలదై – మ్రొక్కువారి చిక్కులు దీర్చి కాచు ఆ శివాఖ్యపరబ్రహ్మమునందు నాలో భక్తిభావము తల ఎత్తు గాక!

**వివరము : 'శంభుః శం భవతి యస్మాత్ సః'** ఎవని నుండి సుఖముదయించునో వాడు శంభువు. అనగా శివుడు సుఖస్వరూపి; ఆనందమే రూపుగా గలవాడు. మనమనుభవించు లౌకికానందము లన్నియును సుఖకందము, ఆనందమయము నగు శివరూపమునుండి వెలువడిన తుంపరలే.

ఏకాగ్రచిత్తముతో శివునకు వినతుడైనవాడు శివుడే అగుచున్నాడు. అపుడు వానిని చిక్కులెట్లు వెంబడింపగలవు? **శివారాధనము చేసితిని, చిక్కులు వదలలేదు – అను మాట**

**దబ్బఱ.** ఎచ్చట శివుడు తప్ప అన్యమేమియును లేదో. అంత వరకు నీ చిత్తమును బలవంతముగా నెట్టుకొని పొమ్ము. అచట మరి చిక్కులుండునా?

ఓయీ! శివుని వరకు నీ చిత్తమే నీతోడ రానేరదు చిక్కులకచట ప్రవేశమేదయ్యా! ఒకసారి శివస్థానమును అనుభవించి, వెనుదిరిగివచ్చి చూడుము. నీ చిక్కులు నీకు వెదకినను కానరావు. **'శుద్ధాంతఃకరణముతో శివునారాధింపుము'** అని ఉపదేశము.

---



**శ్లో॥ అస్మిన్నపి సమయే మమ**
**కంఠచ్ఛాయావిధూతకాలాభ్రమ్ ।**
**అస్తు పురో వస్తు కిమ-**
**ప్యర్ధాఙ్గేదారమున్మిషన్నిటలమ్ ॥ 24**

**ప్రతిపదార్థము :** కంఠ.... .... భ్రమ్.

కంఠచ్ఛాయా = కంఠమందలి నలుపు రంగుచే, విధూత = దూరమునకు నెట్టబడిన. కాలాభ్రమ్ = కాలమేఘముగల, ఉన్మిషత్ + నిటలమ్ = ఱెప్పలల్లార్చు ఫాలభాగముగల, అర్ధ + అఙ్గేదారమ్ = ఒడలిలోని సగము ఆలికిచ్చిన, వస్తు = వస్తువు, అస్మిన్ + అపి సమయే = ఇపుడైనను, మమ–పురః–అస్తు = నా ఎదుట దోచుగాక!.

**తాత్పర్యము :** మబ్బుల నల్లదనమును డిల్లవడజేయు నీలకంఠము – తన యింతికి సగము మేను ధారవోసిన ఫాలనేత్రము – ఆ అనిర్వచనీయవస్తువు ఇపుడైనను నా ఎదుట వెలయుగాక!

**వివరము : భగవత్ప్రాప్తికైన సాధనలో ఫలానుభవమునకై తొందర ఉండవచ్చును. విసువన్నది పనికిరాదు. అట్టివాడే గమ్యము జేరును,** అని ఉపదేశము.

---

**శ్లో॥ జటిలాయ మౌళిభాగే**
**జలధరనీలాయ కన్ధరాభోగే ।**
**ధవళాయ వపుషి నిఖిలే**
**ధామ్నే స్యాన్మామకో నమోవాకః ॥ 25**



**ప్రతిపదార్థము :** మౌళిభాగే = శిరోదేశమున, జటిలాయ = జడలుగల, కంధరాభోగే = కంఠదేశమున, జలధరనీలాయ = మబ్బువలె నల్లనైన, నిఖిలే వపుషి = సర్వశరీరమున, ధవళాయ = తెల్లనైన, ధామ్నే = తేజముకొఱకై, మామకః = నాయొక్క, నమో వాకః = నమస్కారము, స్యాత్ = అగుగాక!.

**తాత్పర్యము :** తలపై జడలు – గొంతులో నలుపు – దేహమున తెలుపు అయియున్న తేజమున నా మ్రొక్కు చెల్లుగాక!

**వివరము :** భగవద్విషయమున పునరుక్తి దోషము కాదు. గుణము.

---



**శ్లో॥ అకరవిరాజత్ సుమృగై-**
**రవృషతురఙ్గైరమౌళిధృతగఙ్గైః ।**
**అకృతమనోభవభఙ్గై-**
**రలమన్యైర్జగతి దైవతాపశదైః ॥ 26**

**ప్రతిపదార్థము :** అకరవిరాజత్ సుమృగైః = కరమున శోభించు లేడి లేని, అవృషతురఙ్గైః = నందీశ్వరుడు వాహనముగా లేని, అకృతమనోభవ భఙ్గైః = మదనుని భంగపాటు పాల్సేయని, అమౌళి ధృత గఙ్గైః = తలపై గంగను ధరింపని, అన్యైః దైవతాపశదైః = ఇతరములైన నీచ దైవతములచే, జగతి = లోకమున, అలమ్ = చాలును.

**తాత్పర్యము :** కరమున లేడిని, శిరమున గంగను ధరింపని – వృషభ వాహనారూఢము కాని – కాముని గీటడంపని బక్క దైవములతో నాకు పనిలేదు.

**వివరము :** వృషభము ధర్మమునకు సంకేతము. స్వామికి ధర్మమే వాహనము. **ధర్మము తప్పని చోట స్వామి ప్రకాశించును.** 'కరమున లేడి' ఖగోళమునందలి చుక్కలలో శివుని దర్శించుట జ్యోతిశ్శాస్త్రకర్తలు ఆకసమందొకచో కానవచ్చు చుక్కలను ఊహారేఖలతో గలిపి – శివుని ఆయన చేతిలో లేడిని మార్చి ప్రస్తావించినారు. విశ్వమంతయు శివస్వరూపమే! ఆకసమందలి తారకలున్నూ శివునకు వేరుకావు, అది ఇచట నిరూపింపబడెను.

సరిగా ఇట్టిదే దుర్వాసోముని ప్రణీతమైన ఒక శ్లోకము పరమేశ్వరీ స్తుతిపరము ఉన్నది.

**"అలమలమకుసుమబాణై-రబింబశోణైరపుణ్డ్రకోదణ్డైః ।**
**అకుముదబాన్ధవచూడై-రన్యైరిహ జగతిదైవతమ్మన్యైః ॥"**

'చెఱుకువిల్లు – పూవుటమ్ము' లేని – చంద్రచూడము, బింబశోణము (దొండ పండువలె ఎఱ్ఱనిది) కాని 'మేమును వేల్పులమే' అనుకొనువారితో మాకు బనిలేదు, పనిలేదు.

శ్లోకము యొక్క పోలిక శ్రీ సదాశివేంద్రులు దుర్వాసునకు సములని నిరూపించుచున్నది.

---

శ్లో॥ కస్మై వచ్మి దశాం మే
కస్యేదృగ్ హృదయమస్తి శక్తిర్వా ।
కస్య బలం చోద్ధర్తుం
క్లేశాత్ త్వామన్తరా దయాసిన్ధో! ॥ 27



**ప్రతిపదార్థము :** హే దయాసిన్ధో! = ఓ దయాసాగరా, శివా, మే దశామ్ = నా దుర్దశను, కస్మై వచ్మి = ఎవనికి జెప్పుకొందును?, ఈదృగ్ + హృదయమ్ = ఇట్టి హృదయము, వా = లేక, శక్తిః = సామర్థ్యము, కస్య, అస్తి = ఎవనికున్నది, త్వామన్తరా = నీవు తప్ప, కస్య = ఎవనికి, క్లేశాత్ = కష్టము నుండి, ఉద్ధర్తుమ్ = ఉద్ధరించుటకు, బలం, అస్తి = బలమున్నది?.

**తాత్పర్యము :** కరుణా సాగరా! స్వామీ! శివా! నేనెవ్వరితో నా దుర్దశను మొఱపెట్టుకొందును? నీవలె జాలిగల గుండె ఎవనికున్నది? విపద్విముక్తుని గావించుటకు నీవుతప్ప ఇతరుల కెవ్వరికి బల సామర్థ్యములున్నవయ్యా?

**వివరము : శివానుగ్రహముచే మాత్రమే భవబాధావిముక్తి.**

---



శ్లో॥ యాచే హ్యనభినవం తే
చన్ద్రకలోత్తంస! కిఞ్చిదపి వస్తు ।
మహ్యం ప్రదేహి భగవన్!
మదీయమేవ స్వరూపమానన్దమ్ ॥ 28

**ప్రతిపదార్థము :** హే చన్ద్రకలోత్తంస! = ఓ చంద్రరేఖ శిరోభూషణముగా గల స్వామీ, తే = నీయొక్క, అనభినవం = క్రొత్తది కాని (సనాతనమైన), కిఞ్చిత్ + అపి వస్తు = ఒకానొక వస్తువును, యాచే = నేను యాచించుచున్నాను, హే భగవన్ = ఓ దేవా, మదీయమ్ + ఏవ స్వరూపమ్ = నా స్వరూపమే అయిన, ఆనన్దమ్ = ఆనందమును, మహ్యమ్ = నాకై, ప్రదేహి = ప్రసాదింపుము.

**తాత్పర్యము :** ఓ చంద్రకలాధరా! నేనేమీ క్రొత్త వస్తువు నడుగుట లేదయ్యా! చాలా పురాతనమైన, సనాతనమైన, నీ వస్తువు నర్థించుచున్నాను. వాస్తవమునకది నీది మాత్రమే కాదు, నాది కూడ. నాదైన ఆనందరూపమును నాకు అనుగ్రహింపవయ్యా!

**వివరము :** ద్వైతభావనయందు **'తే నమః'** 'నీకు నమస్కారము'. అద్వైత భావనయందు **మహ్యం నమః** నాకు నమస్కారము. **"జీవో బ్రహ్మైవ నాపరః"** జీవుడు పరబ్రహ్మమే. వేరు కాదు. సర్వజీవకోటి యొక్క మూలరూపము ఆనందమే, ఆనందమే పరబ్రహ్మము. **'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే'** అని శ్రుతి. 'ఆ పరబ్రహ్మము

సనాతనము, దానికంటె ప్రాతది లేదు. క్రొత్త వస్తువునిచ్చుటకు వెనుకాడుదురు. అడుగుటకును సంశయింతురు. ప్రాతదానిని ఇచ్చుటకు వెనుకాడ బనిలేదు. అందున ఆ వస్తువు యాచించు వానిదే అయినపుడు తిరస్కరించు నక్కఱయే ఉండదు'. అన్నది ఇచట సారస్యము.

ఆనందమయమైన శివాఖ్యపరబ్రహ్మమునుండి – అజ్ఞానముచే వేరైనటులున్న జీవకోటికి – **శివారాధనానుగ్రహములచే మాత్రమే స్వరూపోపలబ్ధి** – అని ఉపదేశము.

---

శ్లో॥ భగవన్! బాలతయా వా
ఽభక్త్యా వాఽప్యాపదాకులతయా వా ।
మోహావిష్టతయా వా
మాస్తు చ తే మనసి యద్దురుక్తం మే ॥ 29



**ప్రతిపదార్థము :** హే భగవన్ = ఓ దేవా, బాలతయా వా = బాలభావముచే గాని, అభక్త్యా వా = భక్తి లేకపోవుటచే గాని, ఆపత్ + ఆకులతయా వా = విపత్తులవలన కలవరపాటుచే గాని, మోహావిష్టతయా వా = అజ్ఞానావిష్టుడ నగుటచే గాని, మే = నాయొక్క, దురుక్తం యత్ = దుర్భాషణమేదైన ఉన్నచో అది, తే మనసి = నీ మనసున, మా + అస్తు = నిలువకుందు గాక!.

**తాత్పర్యము :** స్వామీ! బాలభావము చేతనో – భక్తి రాహిత్యము చేతనో – ఆపదల వలన ఆకులపాటుచేతనో – అజ్ఞానముచేతనో – నానుండి ఏమైనా దురుక్తులు వెడలినచో వానిని నీ మనసున నిలపకుము.

**వివరము :** పరమేశ్వర ప్రాప్తికైన సాధనలో మొదటిమెట్టు మీదనే ఉండుట బాలభావము. అపుడు పరమేశుని వినుతించుటకు తగిన జ్ఞానము లేక దోషములు దొరలవచ్చును.

లోకము ధనమునో సమస్యానివృత్తినో వాంఛించి శివుని పాదములు పట్టుకొనును. అపుడు వారిదృష్టి తమదైన సమస్యా విముక్తిమీద నిలుచును. అది భక్తివలె దోచునేకాని భక్తి కాదు. అపుడును శివారాధనమున దురుక్తులు వెల్వడవచ్చును. అజ్ఞానము, విపత్తు కారణముగా విలవిలలాడుట అనునవి కూడ ఇట్టివే. **సాధకుడైనవాడు అను పదము తన చిత్తము దేనియందు నిలిచియున్నదో పరిశీలించి దానిని సరిచేసుకొనుచుండవలెనని ఉపదేశము.**

---



శ్లో॥ యది విశ్వాధికతా తే
యది నిగమాగమపురాణయాథార్థ్యమ్ ।
యది వా భక్తేషు దయా
తదిహ మహేశాశు పూర్ణకామః స్యామ్ ॥ 30

**ప్రతిపదార్థము :** హే మహేశ! = ఓ పరమేశా, తే = నీకు, విశ్వాధికతా యది = అన్నిటికంటె ఆధిక్యమున్నచో, నిగమా .... .... ర్థ్యమ్. నిగమ = వేదముల, ఆగమ = దేవపూజాదికమును వివరించు శాస్త్రములు, పురాణ = పురాణముల, యాథార్థ్యం యది = సత్యత్వమున్నచో, వా = లేదా, భక్తేషు = భక్తులయందు, దయా = దయ యున్నచో, తత్ + ఇహ = అందువలన నిచ్చట, ఆశు = శీఘ్రముగా, పూర్ణకామః, స్యామ్ = కోరికలన్నియును దీరినవాడ నగుదునుగాక!.

**తాత్పర్యము :** ఏ మహేశా! నీవు సర్వాధికుడవు. వేదములు, ఆగమములు, పురాణములు అసత్యము పలుకుటలేదు. నీవు దయామయుడవు. ఇదంతయు నిజమే అయినచో ఓ స్వామీ! నాకు పూర్ణకామతను బ్రసాదింపుము.

**వివరము : సాధక భక్తుని మానసమున పరమేశుని అస్తిత్వ దయా విశేషములను గూర్చిన సంశయ ముండరాదు.** అని ఉపదేశము. ఆత్మోపలబ్ధిచే మాత్రమే పూర్ణకామత,

**"ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః**
**కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్"**

'ఇదుగో! నా ఆత్మస్వరూపము ఇది' – అని గ్రహించి – ఆత్మజ్ఞానసంపన్నుడైన వానికి – పాంచభౌతికదేహముతో అంతవరకు గల తాదాత్మ్యము రాలిపోవును. అంతేకాదు, ఆతడు ఇంద్రియములకంటె – మనసుకంటె – బుద్ధికంటె తనను వేరుగా అనుభవించును.

శరీరమును - ఇంద్రియములను - మనసును - బుద్ధిని అంటిపెట్టుకొని, వానితో తాదాత్మ్యము కలిగియున్నంత వరకు కోరికలు ఉండును. శరీరముతో సంబంధము (తాదాత్మ్యము) తొలగిపోయినపుడు కోరికలేమి ఉదయించును? దేనిని గూర్చి ఉదయించును? అనగా 'ఆత్మజ్ఞానసంపన్నునకు కోరికలుండవు; వాడే పూర్ణకాముడు – అనియు – **పూర్ణకాముడగుటకు శివపదమే శరణ్యము'** అనియు ఉపదేశము.

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీ పరమశివేంద్ర పూజ్యపాదుల శిష్యులు - అయిన
**శ్రీ సదాశివబ్రహ్మేంద్రులు**
రచించిన **శ్రీ శివమానస పూజా స్తోత్రము**
సంపూర్ణము.

శ్రీః

శ్రీః

# అద్వైతతారావళిః

## శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రవిరచితా

శ్లో॥ అఖిలపరమహంసదేశిక-
మాగమగూఢార్థదర్శకం ప్రాజ్ఞమ్ ।
ఆనన్దపూర్ణసాగర-
మనిశమహం నౌమి శఙ్కరాచార్యమ్ ॥ 1

**తాత్పర్యము :** శ్రీ శంకరభగవత్పాదులవారు పరమహంసపరివ్రాజకులైన మహాత్ముల కందరకును గురువులే. ఆవేదగూఢార్థవిజ్ఞాతకు - పూర్ణానందసాగరునకు నా నిరంతర ప్రణామములు. (సదాశివుల గురువులైన పరమశివేంద్రులును జగద్గురువులై శంకరాచార్యులే) ఈ ప్రణామము వారికిని వర్తించును.

శ్లో॥ శరణం న భవతీ జననీ
న పితా న చ సోదరా నచాన్యే ।
పరమం శరణమిదం మే
చరణం మమ శిరసి దేశికన్యస్తమ్ ॥ 2

**తాత్పర్యము :** తల్లి రక్షింపదు - తండ్రి రక్షింపదు. సోదరులు, ఇతరులు కాపాడజాలరు. నా తలపై నుంచబడిన శ్రీగురుచరణమొక్కటియే నాకు శరణము! నాకు రక్షకము.

శ్లో॥ స్వాత్మావబోధహీనాః
కుణపశరీరాభిమానపరితుష్టాః ।
వారిజబుద్బుదరక్షాం
మూఢాః కుర్వన్తి మోహబన్ధేన ॥ 3

**తాత్పర్యము :** మూఢులు ఈ శరీరమే తామనుకొనుచున్నారు. అచ్చమైన తమ స్వరూపమును (ఆత్మను) గుర్తింపజాలక - శవమైన ఈ శరీరమునభిమానించుచు - అజ్ఞానమునకు జిక్కి, నీటి బుడగ వంటి దీని రక్షణ యత్నములో నిమగ్నులగుచున్నారు.

శ్లో॥ తదిదం తాదృశమేతా-
వత్తావదితి చ యన్న భవేత్ ।
బ్రహ్మ తదిత్యవధేయం
నోచేద్విషయో భవేత్పరోక్షం చ ॥ 4

**తాత్పర్యము :** అది - ఇది, ఇట్టిది - అట్టిది, ఇంత - అంత - అని తెలియుటకు

సాధ్యము కానిది బ్రహ్మము. అట్లు తెలియుటకు వీలైనదైనచో అది విషయమే! శబ్దస్పర్శ రూప రస గంధాత్మకమే! అది బ్రహ్మమువలె అపరోక్షము కానేరదు. (ప్రత్యక్షమైనది సంసారము, పరోక్షమైనది స్వర్గాదికము. ఆత్మతత్త్వము సంసారమువలె ప్రత్యక్షము కాదు. స్వర్గాదులవలె పరోక్షమునటకును వీలుకాదు. అది అపరోక్షము.)

శ్లో॥ సతి కోశశక్త్యుపాధౌ
సంభవతస్తస్య జీవతేశ్వరతే ।
నోచేత్తయోరభావాద్
విగతవిశేషం విభాతి నిజరూపమ్ ॥ 5

**తాత్పర్యము :** శరీరము పంచకోశాత్మకము. అట్టి ఉపాధియందలి తాదాత్మ్యముచే జీవుడు, మాయోపాధిచే ఈశ్వరుడు ఈ ఉపాధులను దిగజార్చినపుడు జీవేశ్వరులకు (తత్తదుపాధిగత చిద్వస్తువునకు) భేదము లేదు. నిర్విశేషమై – బ్రహ్మాభిన్నమై ఆత్మస్వరూప మపుడు భాసించును.

శ్లో॥ జలమివ మృగతృష్ణాయాం
శుక్తౌ రజతం యథాహిరివ రజ్జౌ ।
సత్యమివ సకలమేతత్
కల్పితమాభాతి మయి పరానన్దే ॥ 6

**తాత్పర్యము :** ఎండమావిలో నీరువలె – ముత్తెపుఁజిప్పయందు వెండి వలె – త్రాటియందు పామువలె – ఆనందఘనుడవై నా యందు ఈ సర్వమును సత్యమన్నట్లు కల్పితమయ్యెను.

శ్లో॥ ఇదమిదమితి ప్రతీతౌ
వస్తుని సర్వత్ర బాధ్యమానేపి ।
అనిదమబాధ్యం తత్త్వం
సత్త్వాదేతస్య న చ పరోక్షత్వమ్ ॥ 7

**తాత్పర్యము :** 'ఇది – ఇది' యని తనకంటె వేరుగా దోచుచున్న వస్తువులనెల్ల బయటను లోపలను గూడ (మనోబుద్ధ్యాదుల యందును) తానుగాదని త్రోసివేయగా – 'ఇది' యని పేర్కొనుటకును – త్రోసివేయుటకును అశక్యమైన వస్తువొకటి (ఆత్మతత్త్వము) మిగిలి యుండును. అది త్రికాలాబాధ్యమైనది. అందుచే అది అపరోక్షమైనది.

శ్లో॥ అఖిలాగమాంతలక్ష్యం
హానోపాదానహీనచిన్మాత్రమ్ ।
అనుభూతిమాత్రగమ్యం
బ్రహ్మైవాహం తదస్మి పరిపూర్ణమ్ ॥ 8

**తాత్పర్యము :** ఉపనిషత్తులన్నియును బ్రహ్మమునే రక్షించుచున్నవి. తరుగుట – పెరుగుట అన్నది లేక చిన్మాత్రమగా (కేవలము జ్ఞానస్వరూపముగా) అనుభవమునకు మాత్రము అందుచున్న – ఆ బ్రహ్మము నేనై యున్నాను. అంతటను నిండియున్న ఆ బ్రహ్మము నేనే!

**శ్లో॥ చిన్మాత్రమమలమక్షయ–**
**మద్వయమానన్దమనుభవారూఢమ్ ।**
**బ్రహ్మైవాస్మి తదన్యం**
**న కిమప్యస్తీతి నిశ్చయో విదుషామ్ ॥ 9**

**తాత్పర్యము :** బ్రహ్మమన్నది కేవలము జ్ఞానస్వరూపము. దానియందు పరిసంపర్కము లేదు. దానికి నాశము లేదు. రెండవదన్నదిలేక ఒక్కటియై అది ప్రకాశించుచున్నది. ఆనందమయమైన ఆ బ్రహ్మము అనుభవముచే దెలియదగినదే కాని, 'ఇది' యని నిరూపించుటకు శక్యము కాదు. అట్టి బ్రహ్మమే నేను! దానికంటె వేరేమియును లేదు" – అని విద్వాంసుల నిర్ణయము.

**శ్లో॥ జ్ఞానం కర్మణి న స్యాద్**
**జ్ఞానే కర్మేదమపి తథా న స్యాత్ ।**
**కథమయమనయోరుభయో–**
**స్తపనతమోవత్ సముచ్చయో ఘటతే ॥ 10**

**తాత్పర్యము :** కర్మయందు జ్ఞానముండదు. జ్ఞానమున కర్మయు నుండదు. జ్ఞానము సూర్యుడు, కర్మము చీకటి. ఇట్లున్న ఇవి రెండును కలిసి – నాయందెట్లుండును! నేను జ్ఞాన స్వరూపిని, నాయందు కర్మలు లేవు, ఉండవని భావము.

**శ్లో॥ తస్మాన్మోహనివృత్తౌ**
**జ్ఞానం న సహాయమన్యదర్థయతే ।**
**యద్వద్ఘనతరతిమిర–**
**ప్రకరపరిధ్వంసనే సహస్రాంశుః ॥ 11**

**తాత్పర్యము :** జ్ఞానము ఇట్టిదగుట చేతనే (సూర్యునివంటిదగుట చేతనే) అజ్ఞానమును నివారించుట యందు దానికి వేరొకదాని సాయమక్కరలేదు. ఎంత చిక్కని చీకటుల మొత్తములనైనను చీల్చి చెండుటలో చెండి రూపుమాపుటకు సూర్యునకు వేరొక తోడు కావలయునా!

**శ్లో॥ కర్మభిరేవ న బోధః**
**ప్రభవతి గురుణా వినా దయానిధినా ।**
**ఆచార్యవాన్హి పురుషో**
**వేదేత్యర్థస్య వేదసిద్ధత్వాత్ ॥ 12**

**తాత్పర్యము :** దయామయుడైన గురువులేక – కేవలము కర్మలచేతనే జ్ఞానమెన్నడును ఉదయింపదు. **'ఆచార్యవాన్ హి పురుషో వేద'** – ఎవనికి సద్గురువు లభించునో, అతడు మాత్రమే – ఆత్మతత్త్వమును బ్రహ్మాభిన్నముగా ననుభవించును – అని శ్రుతి తెలుపుచున్నది గదా!

**శ్లో॥ ఐక్యపరైః శ్రుతివాక్యై-**
**రాత్మా శశ్వత్ప్రబోధ్యమానోఽపి ।**
**దేశికదయావిహీనై-**
**రపరోక్షయితుం న శక్యతే పురుషైః ॥ 13**

**తాత్పర్యము :** జీవబ్రహ్మైక్యమును శ్రుతివాక్యము లెంతగా బోధించుచున్నను – శ్రీ గురు కరుణాప్తిలేక దానిని సాక్షాత్కరింపజేసుకొనుట (అనుభవించుట) ఎంతటివారికైనను అసాధ్యమే!

**శ్లో॥ మయి సుఖబోధపయోధౌ**
**మహితబ్రహ్మాండబుద్బుదసహస్రమ్ ।**
**మాయామయేన మరుతా**
**భూత్వా భూత్వా పునస్తిరోధత్తే ॥ 14**

**తాత్పర్యము :** ఆహా! ఆనందవారాశినైన నాయందు జెలరేగిన మాయ యను గాలి తాకిడిచే వేలకొలది బ్రహ్మాండములు నీటిబుడగలవలె తల ఎత్తి ఎత్తి తిరోహితములగుచున్నవి.

**శ్లో॥ దన్తిని దారువికారే**
**దారు తిరోభవతి సోఽపి తత్రైవ ।**
**జగతి తథా పరమాత్మా**
**పరమాత్మన్యపి జగత్తిరోధత్తే ॥ 15**

**తాత్పర్యము :** కఱ్ఱ ఏనుగులో కఱ్ఱ భాసింపదు. (చూచినవాడు 'అదిగో! ఏనుగు!' అనునే కాని, 'అదుగో! కఱ్ఱ!' అనడు) ఆ ఏనుగు కూడ అచటనే యున్నది! ఏనుగురూపుపై చూపు నిలిపినపుడు కఱ్ఱ మాయమగును. ఆ ఏనుగుకూడ అందే యున్నది. అది కఱ్ఱయే! దారువే!

లోకమును రక్షించునపుడు పరమాత్మ – పరమాత్మను లక్షించునప్పుడు లోకము అదే విధముగ అంతర్హితమగును.

(కఱ్ఱయే – ఏనుగు రూపమున – దాని కాళ్ళు – కడుపు – తొండము, దంతములు – ఇత్యాదులుగా) ఉన్నట్లు పరమాత్మయే కనబడుచున్న యీ నిఖిలలోకమున నున్నాడు. లోకము మీదనే చూపు నిలుపువానికి పరమసత్యమైన పరమాత్మ అనుభవమునకు అందదు. అట్లే పరమాత్మ యందే బుద్ధిని నిలిపినవానికి ఈ లోకము ఉన్నను లేనట్లే! అది భాసింపదు. సర్వము బ్రహ్మమయమే!

శ్లో॥ తస్మిన్ బ్రహ్మణి విదితే
విశ్వమశేషం భవేదిదం విదితమ్ ।
కారణమృదివిదితాయాం
ఘట-కరకాద్యా యథావగమ్యన్తే ॥ 16

**తాత్పర్యము :** మృణ్మయపాత్రలు పలురకములు, వీనికి కారణము మృత్తు (మట్టి). అది తెలియబడినంతనే తత్కార్యములైన కుండ - కూజా మొదలైనవి ఎన్నియున్నను, అన్నియును దెలియబడును. అట్లే సర్వకారణ కారణమైన బ్రహ్మమును గూర్చిన జ్ఞానము ఉదయింపగా - ఈ విశ్వమంతయును దెలియఁబడును.

శ్లో॥ ఏష విశేషో విదుషాం
పశ్యన్తో౽పి ప్రపఞ్చసఞ్చారమ్ ।
పృథగాత్మనో న కిఞ్చిత్
పశ్యేరన్ నిఖిలనిగమనిర్ణీతాత్ ॥ 17

**తాత్పర్యము :** ఎన్నో విధములుగా కదలుచున్న ఈ ప్రపంచము పామరునకెట్లు కనబడు చున్నదో - పండితునకును అటులే కనబడుచుండును. కాని విద్వాంసులు సర్వ వేదతాత్పర్యమును దృష్టియందుంచుకొన్నవారై, ఈ నిఖిల ప్రపంచమును ఆత్మాభిన్నముగా అనుభవించుచుందురు. ఇదియే పామరునికంటె పండితునియందలి విశేషము. (సర్వమును ఆత్మాభిన్నముగా దర్శింపనివాడు ఎంత చదివినను పండితుడు కాడు. పామరుడే!)

శ్లో॥ జగదాకారతయాపి
ప్రథతే గురుశిష్యవిగ్రహతయాపి ।
బ్రహ్మాకారతయాపి
ప్రతిభాతీదం పరాత్పరం సర్వమ్ ॥ 18

**తాత్పర్యము :** శరీరము కంటె ఇంద్రియములు, వానికంటె మనసు, దానికంటె బుద్ధి - బుద్ధికంటెను ఆత్మ పరమైనవి (అవ్వలనున్నవి గొప్పవి.) ఇట్లు అన్నిటికిని బరమైనది బ్రహ్మము. పరాత్పరమైన ఆ వస్తువే - జగత్తుగా జూచుచున్నది. గురువై అదియే బోధించుచున్నది. మరియు శిష్యాకారమున గూడ నదియే ప్రవర్తిల్లుచున్నది. అదియే బ్రహ్మాకారమున భాసించుచున్నది. **"ఉన్నది యొక్కటియే! రెండవది లేదు!"**.

శ్లో॥ కిం చిన్త్యం కిమచిన్త్యం
కిం కథనీయం కిమస్త్యకథనీయమ్ ।
కిం కృత్యం కిమకృత్యం
నిఖిలమిదం జానతాం విదుషామ్ ॥ 19

**తాత్పర్యము :** అద్వితీయమై బ్రహ్మమొక్కటియే విరాజిల్లుచున్నదన్న ఎరుక గల విద్వాంసుల – మనో వాగింద్రియ వృత్తులకు (మనో వృత్తి చింతనము. వాగ్వృత్తి వర్ణనము, ఇంద్రియవృత్తి కర్మాచరణము) విషయము కాదగినది – కాకూడనిది అన్న విభాగము ఉండదు. బ్రహ్మానుభవమగ్నునకు విధినిషేధములు లేవు.

**శ్లో॥ కబలితచఞ్చలచేతో**
**గురుతరమణ్డూకజాలపరితోషా ।**
**శేతే హృదయగుహాయాం**
**చిరతరమేకైవ చిన్మయీ భుజగే ॥ 20**

**తాత్పర్యము :** కప్పలను కడుపునిండుగా మెసివి, సుఖముగా శయనించి యున్న సర్పమువలె – గంతులిడుచున్న మానసికవృత్తులనన్నిటిని ఆహరించి, హృదయగుహయందొంటిగా చిత్స్వరూపము చిరతరనైశ్చల్యముతో విరాజిల్లుచున్నది.

(మనోవృత్తులు – శబ్ద – స్పర్శ – రూప – రస – గంధాత్మకములైన విషయములపై నిత్యము గంతులు వేయుచుండును. జ్ఞానముదయింపగానే ఈ గంతులు పూర్తిగ ఆగిపోవును. అనంతరము జ్ఞానమొక్కటియే నిశ్చలముగా ప్రకాశించును.)

**శ్లో॥ సతి తమసి మోహరూపే**
**విశ్వమపశ్యం తదేతదిత్యమలమ్ ।**
**ఉదయతి బోధాదిత్యే**
**కిమపి న పశ్యామి కిం న్విదం చిత్రమ్ ॥ 21**

**తాత్పర్యము :** నాకు చిమ్మచీకటిలో సర్వమును గోచరించి – సూర్యోదయమైనంతనే ఏమియును కనబడుటలేదు! చిత్రముగా లేదూ! అజ్ఞానమన్న చీకటి యున్నంతవరకును – దారపుత్రాదులు, కలిమిలేములు, సుఖదుఃఖములు, మిత్రవర్గ శత్రువర్గములు – ఇత్యాదిగా ప్రపంచము నానావిధములుగా కనబడుచు వచ్చినది. **జ్ఞానసూర్యుడుదయింపగా ఈ నానాత్వమేమియు నాకు గానవచ్చుటలేదు!** ఇదయ్యా చిత్రము!

**శ్లో॥ విద్యాస్థితయః ప్రాజ్ఞే**
**సాధనభూతాః ప్రయత్ననిష్పాద్యాః ।**
**లక్షణభూతాస్తు పునః**
**స్వభావతః సంస్థితాః స్థితప్రజ్ఞే ॥ 22**

**తాత్పర్యము :** తెలిసినవాడు బ్రహ్మాత్మైక్యస్థితిని యత్నించి నిలువబెట్టును. అది సాధనదశ. తెలివి ఎవనియందు రూఢమూలమైనదో ఆ స్థితప్రజ్ఞునకు బ్రహ్మనిష్ఠయే స్వభావమగును; సహజలక్షణమగును. అచట మరి ప్రయత్నపూర్వకమైన సాధనముతో బనియుండదు.

శ్లో॥ జీవన్ముక్తిరితీమాం
వదన్త్యవస్థాం స్థిరాత్మసంబోధామ్ ।
బాధితఖేదప్రతిభా-
మబాధితాత్మావబోధసామర్థ్యామ్ ॥ 23

**తాత్పర్యము :** అచ్చమైన ఆత్మజ్ఞానము బాగుగా స్థిరపడి, తాపకారులైన దుఃఖముల బలమెల్ల వీగిపోయి – ఆత్మావబోధమునకు బాధకమైనది లేశమునులేని అవస్థయే జీవన్ముక్తి అని ఆర్యోక్తి.

శ్లో॥ అజరోఽహమక్షరోఽహం
ప్రాజ్ఞోఽహం ప్రత్యగాత్మబోధోఽహమ్ ।
పరమానన్దమయోఽహం
పరమశివోఽహం సదాస్మి పరిపూర్ణః ॥ 24

**తాత్పర్యము :** నేనజరుడను, అక్షరుడను, శిథిలమగుట – నశించుట – దేహాదులకే కాని బ్రహ్మమునైయున్న నాకు లేవు. నేను ప్రాజ్ఞుడను. నేను ఆత్మజ్ఞానాకృతిని. (శరీరము – ఇంద్రియములు – అంతఃకరణము ఇవేవియును దాను కాదనియు, వీనికవ్వల నఖండముగా వెలయుచున్న వస్తువేది యున్నదో, దేనివెలుగులో నివియెల్ల భాసింపుచున్నవో ఆ వస్తువు అనగా బ్రహ్మము తాననియు గుర్తించినవాడు ప్రాజ్ఞుడు.) (దేహేంద్రియాదులకంటె విలక్షణమై ఆత్మస్వరూపము భాసింపుచున్నదన్న తెలివి యేది కలదో – ఆ తెలివి – ఆ జ్ఞానము అదియే ఆత్మస్వరూపము.) నేను ఆనందమయుడను! నేను పరమశివుడను! నేను పరిపూర్ణుడను!

శ్లో॥ బహుభిః కిమేభిరుక్తై-
రహమేవేదం చరాచరం సర్వమ్ ।
శీకరఫేనతరంగాః
సిన్ధోరపరాణి న ఖలు వస్తూని ॥ 25

**తాత్పర్యము :** వేయిమాటలెందులకు? ఈ సర్వమైన చరాచర ప్రపంచమును నేనే! తుంపరలు – నురగ – తరంగములు – సముద్రము కంటె వేరైనవా?

శ్లో॥ విదితో వేదరహస్యం
విదితో దేహాదిరయమనాత్మేతి ।
విదితం పర ఇతి చాత్మా
కిమితఃపరమస్తి జన్మసాఫల్యమ్ ॥ 26

**తాత్పర్యము :** ఆహా! వేదములలో దాగియున్న రహస్యము నాకు వెల్లడియైనది. ఈ దేహాదికము నేను కాదని (అనాత్మయని) తెల్లమైనది! నేను (ఆత్మ) అన్నిటికిని బరమైనవాడనని

ప్రస్ఫుటమైనది. పుట్టినపుట్టుకకింత కంటె సాఫల్యమున్నదా!

**శ్లో॥ గురుకరుణయైవ నానా-**
**ప్రాక్తనభాగ్యానుకూలమారుతయా ।**
**దుస్సహదుఃఖతరఙ్గో-**
**త్తుఙ్గస్సంసారసాగరస్తీర్ణః ॥ 27**

**తాత్పర్యము :** ఆహా! నా వెనుకటి పుట్టువులలోని పున్నెములు అనుకూలవాయువులై ప్రేరేపించగా నెగసిన శ్రీ గురుకారుణముచే - దుస్సహములైన దుఃఖతరంగములతో సంకులమై సమున్నతమై యున్న సంసారసాగరమును తరించితిని; దాటితిని; దాటి గట్టెక్కితిని!

**శ్లో॥ కారుణ్యాసారసాన్ద్రాః**
**కాంక్షితవరదానకల్పతరువిశేషాః ।**
**శ్రీగురుకటాక్షపాతాః**
**శిశిరాశ్శమయన్తు చిత్తసన్తావమ్ ॥ 28**

**తాత్పర్యము :** శ్రీగురుకరుణాకటాక్షములు సాంద్రకరుణాసారములు! కామితములను బ్రసాదించు కల్పవృక్షములు. చల్లని ఆ శ్రీగురు కటాక్షములు నా చిత్తములోని యుత్తముల నుపశమింప జేయును గాక!

ఇతి శమ్

**శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య సదాశివబ్రహ్మవిరచితా**

**అద్వైత తారావళిః**

**సమాప్తా.**

---

